

# ఆత్మ అనగా ఏమిటి?

మన పూర్వులు, జీవి శరీరమును బాయగానే, ఆజీవి పరలోకమునకు ప్రయాణమవునని, పరలోకం అంటే పుణ్యలోకంలోగాని, పాపలోకంలోగాని, అని రెండులోకాలు ఉన్నవని. పుణ్యలోకంనుంచి దేవదూతలు వచ్చిగాని పాపలోకంనుంచి యమభటులుగాని వచ్చి ఈ శరీరములో యున్న జీవిని ఉచ్చులువేసి బంధించి బైటకు లాగి తీసుకు వెళతారని, పుణ్యంచేసినవారిని దేవదూతలు పుణ్యలోకానికి వారు తెచ్చిన రథంపై కూర్చొబెట్టి తీసుకు వెళుతారని, పాపాత్ములను యమభటులు భుజములకు తాళ్లుకట్టి ఈడ్చుకుని వెళుతారని ఆయా లోకాలలో చిత్రగుప్తుని గుమాస్తాలు ఉంటారని, ఈజీవి జీవితకాలంలో ఆచరించిన ప్రవర్తనలన్నీ ఆ గుమాస్తా ఎప్పటికప్పుడు దస్త్రంలో ఈజీవి ఖాతాలో వ్రాస్తూ యుంటాడని ఈజీవి ఆలోకం చేరిన పిమ్మట ఆగుమాస్తా వారి ఖాతాలో వ్రాయబడిన విషయములన్నీ దండధరుని ఎదుట వినిపిస్తాడని అప్పుడు అ దండధరుడు ఆలోచించి, ఆ జీవికి తగు శిక్షలు అనుభవించిన పిమ్మట కడగిన ముత్యమువలె పునర్ జన్మ అనుభవిస్తాడని లోకోక్తి. అదియును పుణ్యలోకంలోకి వెళ్లినవారు అచ్చటచేసిన

పుణ్యములకు ఫలితముగా ఆనందముగా జీవితం గడుపుచూ రంభా సంభోగం, ఇత్యాది ఆనందములను బడసెదరని, ఇట్లు వారివారి పుణ్య పాపఫలముల ననుభవించినపిమ్మట మరల భూలోకములో జంతురూపమునో, పక్షిరూపమునో మానవరూపమునో జన్మిస్తారని మన పురాణములు వర్ణిస్తూ యున్నవి. ఈ పురాణములు ఇట్లుండగా మానవులు జీవిత కాలములో అవసానకాలములో దైవ నామస్మరణ చేస్తే, జీవితమంతయు యెన్ని పాపములు చేసినా, పుణ్యలోకమునకే పోతారని అట్లు ఆచరించనియెడల పాపాత్ములై పాపలోక మునకే పోతారనికూడా వర్ణిస్తూ యున్నవి. ఇట్టిగాధలు, ఇతిహాసములు వేనకువేలు మన కవులచే చిత్రింపబడి దేశ ధర్మములు నడచుచున్నవి. ఉదాహరణకు చూడండి :- ఒక మానవుడు తన జీవితకాలమంతయు పరోపకారము చేసినను అంత్యకాలములో బిడ్డల పోరుతోనో, భార్య గయ్యాళి అయినయెడల, ఆమె సంకటనలతోనో చికాకుగా ప్రవర్తించి దైవభక్తి కుంటుబడినయెడల వాడు పుణ్య లోకము చేరడని నిరూపించుచున్నవి. ఇవి అన్నియు కట్టు కథలు గనుక అవి మానవుని సత్యమార్గమును నడిపించ లేకుండా యున్నవి. అందువల్ల సర్వమానవులు ఆత్మశుద్ధిగా యుండి ప్రపంచంలోని సర్వ జీవరాసులు తమబోటివేయని ఈసమస్త జీవులను, వారికి పోషణకు, జీవయాత్రలకు కావల సిన సర్వ పరికరములు నీరు, గాలి, వెలుతురు ఇత్యాది సర్వపదార్థములను సృష్టించి జీవికి ముందుగానే అందించు చున్న ఆ పరమాత్మ ఒకరు ఉన్నారని, ఆ పరమాత్మయే

అనేక రూపములతో అనేక పదార్థములను ఉత్పత్తి
చేయుచున్నాడని అట్లు ఉత్పత్తిచేసిన పదార్థములలో
ఆత్మయని పిలువబడు ఒక సూక్ష్మరూపరహిత పదార్థము
గలదనియు అది ఎలక్ట్రిక్ కరెంటువలె ప్రతి జీవిత పదా
ర్థమందును యుండుననియు, ఆసూక్ష్మపదార్థము తోడ్పడు
చున్నంతవరకూ ఆపదార్థముతో నింపబడిన రూపవస్తువు
సజీవముగా గోచరమగుననియు, ఏకారణముచేతనైనా ఆ
సూక్ష్మపదార్థమునకు భంగము కలిగిన యెడల అదృశ్య
పదార్థము మురుగెత్తి కంపుకొట్టి కుళ్లిపోవుననియు పిమ్మట
శిథిలమై భూమిలో భాగముగా మారిపోగలదనియు శాస్త్ర
ములు ఘోషించుచున్నవి. ఇవి ఇట్లుండ ఈ ప్రపంచ మం
తయూ నా చేతనే నడుపబడుచున్నదని ప్రగల్భము కొట్టు
మహాత్ములు కొందరు బయలుదేరి వారి హస్తలాఘవముతో
కొన్ని పదార్థముల నుత్పత్తి చేసి తమలో ఇమిడియున్న మహి
మలు ప్రదర్శించి ప్రజలను ఆకర్షించుచున్నారు. ఇట్టి మహా
త్ములుకూడ ఏదో ఒక రోజున ఈ మట్టిలో మట్టిగా మార
వలసినవారే. ఆ విషయమును గ్రహించినవారు వారి ఆర్భా
టములకు మోసపోక తమకు హితమని తోచిన విధముగా
ధర్మరక్షణకు తోడ్పడుచూ జీవయాత్ర చేయుచున్నారు.
ఈవిధముగా ఎన్నికోట్ల సంవత్సరములు యుగములనుండి
యో ఈ మానవ ప్రపంచము నడచుచున్నది. కాని ఇం
దులోని పరమ రహస్యమును జ్ఞానులు గ్రహించి తరించు
చున్నారు. కాని సర్వప్రజానీకమునకు ఈ ధర్మమార్గ రహ
స్యములు బోధపడుటలేదు. ఎండమావుల వెంట దప్పిగొనిన

వారు పరువుతెత్తినట్లుగా పరుగిడుచున్నారు. గనుక ఈ విషయములన్నియూ పరలోకమునుండి చూచుచున్న కొందరు ఋషులు వారి భావములు నేటినుండి వరుసగా చెప్పబోవు చున్నారు. అందులో ప్రథమముగా ఏనాడో ఈ లోకములో పేరు ప్రఖ్యాతులుబడసి జీవితమును ముగించిన విక్రమార్కుడు పిమ్మట బలిచక్రవర్తి పిమ్మట అగస్త్యుల వారు మరికొందరు రేపటినుండి దీర్ఘముగా చెప్పనున్నారు. వాటిని గ్రహించి ఆచరించండి ఇది నామనవి.

18-3-1975

ఇట్లు

శ్రీ ఋషి రాంరాం

# ప్రథమ అధ్యాయము

ప్రతిజీవి మరణించును. మరణించుట, జనించుట లోక ఆచారము. ఇది మానవులకే గాక సమస్త చరాచర జీవజంతువులకు క్రమమైయున్నది. ఈ జననమరణము జరుగుచుండుట కాలచక్ర ప్రవాహములోని ఒక కర్మ. ఈ మరణము తటస్థించిన పిమ్మట ఆ జీవి ధరించియున్న దేహము నిరుపయోగ మగుటయేగాక కుళ్ళికంపు కొట్టు చున్నది. అందువల్ల దానిని కాల్చిగాని, భూమిలో లోతుగా పాతిపెట్టిగాని దుర్వాసనల బారినుండి తప్పించు కొనుచున్నాము. ఇట్లు ఆచరించుటలో మానవులు ముఖ్య ముగా దహన సంస్కారము పాటించుచున్నారు. ఈ దహన సంస్కారము చేయుటకు పూర్వము ఆజీవి శరీర మును బాసి వెడలినట్లుగా జీవియొక్క చేతినాడులు హృదయ నాడులు పరీక్షించి కనుగొనుచున్నారు. మన కంటికి కన బడు శరీరమంతయు యథాప్రకారమే యుండినప్పటికి గడియారములోని స్ప్రింగుకు ఇచ్చినకీ అయిపోగానే గడియా రము ఆగిపోయినట్లుగా దేహములోనుండి ఒక అగోచర వస్తువు ముక్కుగుండానో, నోటిగుండానో మరి ఏ ఇతర రంధ్రముగుండానో వెడలిపోయి యుండవచ్చునని. ఆ వెడలిన పదార్థమే జీవియని లేక ప్రాణమని చెప్పుకొనుచున్నాము. ఆప్రాణి శరీరమును బాసి ఎందుకు ఎచ్చటికి పోవుచున అను సమస్యయే మనచరిత్రకు మూలసమస్య. ఈ సమస్య పరిష్కారమునకు కోట్ల సంవత్సరములనుంచి ఎంతో మంది

ఎన్నో విధముల ప్రయత్నించి తెలుసుకొను చున్నారు. కాని పూర్తిగా ఈ సమస్యకు సమాధానము ఎవరున్నూ చెప్ప లేకుండినారు.

అట్టి ఈ దుర్ఘట సమస్యనుగురించి పరలోకవాసి శ్రీ ఋషి రాంరాంగారు, నా మిత్రులు, మీ గురువులు నాతో చర్చించి, నా పరంగా కొంత భాగమును మీకు నేరుగా నన్నే చెప్పవలసినదని కోరియున్నారు. నేను ఆనందముతో వారిమాట త్రోసిపుచ్చక నేటినుండి పదహారు రోజులు ప్రతిరోజూ ఒక అధ్యాయముచొప్పున చెప్పదలచినాను. నావలెనే నా మిత్రులు నా పిమ్మట ఇదే విషయమును గురించి మీకు బోధచేయ సంకల్పించినారు. ఇట్లు అందరిచే చెప్పబడు విషయములు శ్రద్ధతో గ్రహించి పిమ్మట శ్రీ ఋషి రాంరాంగారి అనుమతితో ఒక గ్రంథరూపమున దేశ ప్రజలకు అందిచ్చి మీ జీవితమును ధన్యముగావించుకొందురు కాని, ఇప్పుడు అసలు కథారంగమునకు ప్రవేశిద్దాం.

మానవుడే కాదు ఈ భూప్రపంచంలో నివసించు 84 లక్షల జీవరాసులకు ఈ జగత్తులో పుట్టుకలు చావులు ధర్మమైయున్నది. పుట్టినప్పుడు జీవి బంధువులు ఆనందించుచున్నారు. మరణించినప్పుడు విచారపడి దుఃఖించుచున్నారు. ఈ ఆనందమునకు విచారమునకు, మూలకారణ మేమిటియని దీర్ఘముగా ఆలోచిస్తే బాంధవ్యప్రేమ లేయని స్పష్టమైనది. జీవి జననమందకపూర్వము లేని ఈ ప్రేమ ఎక్కడ

నుండి వచ్చుచున్నది ? అది ఎట్లు అభివృద్ధి జెందుచున్నది మరి ఎట్లు విచారముతో అంత్యముగాక ఈ జీవినిగురించి ప్రతిమాసము లేక సంవత్సరము ఆజీవిని తలచుకొని ఆజీవి పేరిట శ్రార్ధకర్మలు చేయుచున్నాము. ఈ శ్రార్ధకర్మల భావమేమిటి? ఈ కర్మలవల్లకలుగు ఫలిత మేమిటి యను విషయముకూడా మనము తెలుసుకోవలసియున్నది.

అట్టి కర్మలు ఆచరించుచున్న జీవికూడా కొంతకాలమునకు మరణించుచున్నది. అప్పుడు అంతటితో ఈ జీవి చేయుచున్న కర్మలు ముగింపగుచున్నవి. అంటే వాటిని గురించి ఇతరజీవులకు ఏవిధమైన బాధ్యత లేకుండాపోవుచున్నవి. చనిపోయిన జీవి శరీరమును దహనకర్మలుచేసిగాని భూమిలో పాతిపెట్టిగాని రూపరహితమును చేయుచున్నాముగదా. అట్టితరి ఈచేయు కర్మలు ఎవరిని తలంచి చేయుచున్నామంటే ఈజీవి దృశ్యశరీరములో నుంచి వెడలిన సూక్ష్మరూప రహితవస్తువుకే యని భావించవలసియున్నది. ఆ రూపరహితవస్తువు ఏమిటి ఎచ్చట నున్నది. మనముచేయు కర్మలు ఆరూపరహిత దృగ్గోచరవస్తువుకు ఏవిధముగా చెందుచున్నది యను విషయము మన చర్చనీయాంశము. మరియూ రూపరహితవస్తువు బంధుకోటిచేయు కర్మలను ఏవిధముగా పరిగ్రహించుచున్నది యను విషయము కూడా మనము తెలుసుకొనవలసి యున్నది. ఈ అగోచర రూపరహిత వస్తువునే మన పూర్వీకులు ఆత్మయని పిలచుచున్నారు. మనముకూడా ఇక ముందు దానిని ఆత్మయని సంభోదిద్దాము. ఇట్టి ఆత్మ శరీరములో

ఎక్కడ ఏ ప్రాంతములో దాగియున్నది. అది ఎంత కాలము నుంచి దాగియున్నది? ఇప్పుడు ఎందుకు బైటకు వెళ్ళినది? వెళ్ళి ఏమి చేయుచున్నది యను విషయములు మనము తెలుసుకుందాము.

ఈ ఆత్మ ప్రతిజీవిలోను యుండునా ? మానవులలో మాత్రమే యుండునా అను విషయముకూడా తెలుసుకొన వలసిన విషయం. ఈ ఆత్మ శరీరములో నుండినంతసేపు ఈ శరీరము ఘడియారమువలె పనిచేయుచున్నది గదా ? అట్లు పనిచేయక స్తంభించి పోయినది అనువిషయముకూడా గ్రహించవలసి యున్నది. ఒక ఎద్దును బండికి కట్టి యజ మాని తోలుచున్నాడు. కొంతసేపటికి తోలుట ఆపి బండిని విడతీసి ఆ ఎద్దును గుంజకు కట్టి మేత వేయుచూ దానికి విశ్రాంతి నిచ్చుచున్నాడుగదా ! అటులనే మానవుని జీవి తము కూడా కొంత కాలమునకు విశ్రాంతి నిచ్చుచున్నాడా? అట్లుకాదే అదికుళ్ళి కంపుకొట్టుచున్నది. అంటే విధానము విశ్రాంతికాదు. గనుక శరీరము మాతృగర్భమునుంచి వెడలినప్పుడు అంగుళముల పరిమాణములో యున్నది. దినదిన క్రమముగా పెరిగి పెద్దదగుచూ కొంత కాలమునకు ఆ ఎదుగుట నిలచిపోవుచున్నది. గనుక పెరుగుట పెరిగినట్లే నశింపుకూడా నశించుచున్నది.

ఈ విధానమంతయు ఒక క్రమముగా జరుగుచున్నది. ఇట్లు జరుగుచున్న క్రమము కాలవశమున ఒకనాడు వ్యాధి గానో, దీర్ఘవ్యాధిగానో మరి ఏ ఇతర రూపమునో గోచర

మై ఈ శరీరమునకు పతనావస్థ సంభవించుచున్నది. దీనినే ఉత్పత్తియని, అభివృద్ధియని ముగింపు నశింపు. అని మూడు విధములుగా రూపొందుచున్నది. ఈ మూడు విధములకు మూలాధారము ఏమిటియని మనము తెలుసుకొనవలసి యున్నది. ఈ విషయములన్నియూ రేపటినుండి చర్చిద్దాము.

19-3-75

## రెండవ అధ్యాయము

చదువు రానివారు చదువుకోలేదని బాధపడుచున్నారు. చదువుకొనినవారు వృత్తి లభించలేదని బాధపడుచున్నారు. ఈ ప్రాపంచిక విద్యలు అవసరము లేదని ఆధ్యాత్మిక విద్యల నభ్యసించినవారు దైవమంటే ఏమిటి? ఎక్కడ ఉన్నాడు? ఏరూపములో యున్నాడు? ఆయనకు చావు పుట్టుకలు లేవా? ఉంటే ఆయన పుట్టుక ముందు ఈ ప్రపంచము లేదా? చావు పుట్టుకలు లేని ఎడల ఆయన ఏ కాలమువాడు? ఈ దేశములు, వనములు ప్రజలు, జంతువులు ఎందుకు పుట్టుచున్నవి? ఎవరి మహిమ వల్ల పుట్టుచున్నవి? అట్లు పుట్టినవి తిర్గి ఎందుకు నశించుచున్నవి? జీవికి కొన్ని వ్యాధులు తటస్థమగుచున్నవిగదా వాటి ప్రభావమువల్ల మరణించుచున్నాడు. మరణించిన పిమ్మట ఈ శరీరము మట్టి అగుచున్నది గదా? ఇంకా శేషించినది ఏమిటి? దేనికిమానవులు కర్మకాండలు చేయుచున్నారు? ఈ కర్మకాండలలోని భావమేమిటి? అట్టి

ఆచరించినవి ఈ జీవికి ఏవిధముగా ముట్టుచున్నవి? ముట్టి నట్లు గుర్తు ఏమిటి? కర్మకాండలు చేయనియెడల ఏమి అప చారము కలుగును. కర్మకాండలు ప్రపంచములోని సర్వ మానవులు ఆచరించుచున్నారా! లేక కొందరే ఆచరించు చున్నారా? ఈ కర్మకాండలు చేయునపుడు ఉచ్ఛరించు మంత్రములలోని అర్థముఏమిటి? అను ఇత్యాదివిషయముల ను గురించి తెలుసుకొనిన పిమ్మట ఇంకా ఇతరసమస్యలను గురించి ఆలోచిద్దాం.

ఇందు మొదటి ప్రశ్న ఏమిటంటే ఈ చనిపోయిన జీవి ఎక్కడ ఏరూపములో యుండును?

జవాబు : చనిపోగానే శరీరములోని జీవి లేక ఆత్మ ప్రాంతమందే యుండి సంచారము చేయుచూ సంవత్సరపర్యంతము జీవికి బంధువులు ఆచరించు శ్రాద్ధకర్మలను గమనించుచూ. అట్లు ఆచరించిన కర్మల పూర్వకముగా సమర్పింపబడిన పదార్థములలోని సారమును గ్రహించుచూ యుండును. అది ఎట్లనిన, నీవు ఒకగిన్నెలో, పాలు కాచినప్పుడు కొన్ని పాలు ఆవిరి రూపములో గాలిలోకి పోవుచున్నవి గదా! అదే విధముగా నీవు కర్మచేయునప్పుడు జరుపు హవిస్సులురూప ములో గాలిలో ప్రయాణము చేయుచుండగా అదృశ్యరూ పములో యున్న జీవి వాటిని గ్రహించి అజీవి ఆనందించు చున్నది. ఉదహరణకు చలికాలము నీవు చలి అని దుప్పటి కప్పుకొనుచున్నావు, ఆ చలి ఎక్కడనుంచి వచ్చుచున్నది, దానికి రూపమేమి? అట్టి చలిని ఏనాడైనా చూచినావా?

లేదు, తాకినావా! లేదు. కాని చలిగాలి వస్తూయున్నదని. నీ శరీరమునకు తగులుచున్నదని వణకుచున్నావు. అందుకు ప్రత్యామ్నాయముగా బట్ట కప్పుకొనుచున్నావు. ఇంకా అవసరమైతే చలిమంట వేసుకొనుచున్నావు? అపుడు నీకు చలిబాధ పోయినట్లు ఆనందించుచున్నావు.

ఇగనే ఎండాకాలములో సూర్యరశ్మికి వెచ్చగానున్నదని ఒంటిమీంది వస్త్రములు తొలగించుచున్నావు— అయినప్పటికి ఒంటికి చమటపట్టుచున్నది ఈ చమటకు మూలకారణము ఉష్ణత. వర్షాకాలములో ఆకాశమునుండి జలము వచ్చుచున్నదని మరుగు ప్రదేశములో నివసించుచున్నావు. అదేవిధముగా నీవు ఆచరించు కర్మలలో సమర్పించు ఆహారము, నీరు ఇత్యాదివి గాలిలో మిళితముకాగా ఆ ప్రాంతములో తిరుగాడుచున్న జీవి వాటివల్ల కలుగు సారమును ఆఘ్రాణించుటవల్ల ఆజీవికి ఒకవిధముగా మానవునికి కలుగు ఆకలిదప్పులవంటివి కలుగవు. మరిన్ని ఆజీవి సంచారము చేయుచూ నీకు తెలియకుండగానే నీ గృహములోని వంటకములను రుచిచూచి ఆనందించుచున్నది. ఇందువల్ల ఆ జీవికి యీ కర్మచేయువారు Indirect గా అంటే అప్రత్యక్ష్యముగా జీవిత పదార్థములను కలుగజేయుచున్నారని భావించండి. ఇట్లు ఆచరించిన పదార్థములసారమును పొందిన జీవి పసిబిడ్డ కొంతకాలమునకు పాకుట, పిమ్మట నడచుట అలవరచుకొనినట్లుగా గగనమార్గమున ప్రయాణము చేయును. అంటే ఆజీవికి రెక్కలువచ్చినపక్షి ఎగిరిన చందముగా ఆకాశముగుండా ప్రయాణము చేయును. ఆజీవి గాలి

కంటే తేలిక పదార్థము, ఉదాహరణకు చూడండి, గాలితో వదలిన రబ్బరుబుడ్డ ఆకాశములో ప్రయాణము చేయుచూ వెళ్లి వెళ్లి ఏప్రాంతముననో తనలోని శక్తి నశించగానే పతనమగుచున్నది. అట్లనే ఈజీవి మజిలీలు, మజిలీలుగా ప్రయాణము చేయుచూ కొంత కాలమునకు అనగా 7 లేక 8 మాసములకు పరలోకమునకు చేరును. కాని కొన్ని జీవులు ఆలస్యముగా చేరవచ్చును. అందుకనే జీవికి మాసమాసము మాసికములు ఇత్యాదివి చేయుచూ సంవత్సరమునాటికి పర లోకముచేరి యుండునని తలంపుతో సంవత్సరీక కర్మలు ఆచరించుచున్నారు. ఇది కర్మవిధానములోని మొదటి ఘట్టము. అంతటితో ఆగక ఆ జీవియందు బంధువులకు గల ప్రేమకొద్దీ ప్రతిసంవత్సరము ఆజీవిపేరిట తద్దినములు ఇత్యా దివి జరుపుచున్నారు. కాని ఇవి ఆజీవికి చెందుట లేదని నా అభిప్రాయము. మరిన్ని కొంతమంది ఆజీవికి వస్త్రదాన ములు ఇత్యాదివి చేయుచున్నారు. అంటే ఆజీవిపేర బ్రతికి యున్నవారికి ఇచ్చి ఆనందించుచున్నారు. ఇది ఆజీవికి ఎంత మాత్రము చెందదని నా అభిప్రాయము. ఈకర్మలు ఆజీవి దగ్గర బంధువులు తమ జీవితకాల పర్యంతం చేయు చున్నారు. అట్లు చేయుట వారికి, వారి బంధువులకు తృప్తి కొరకేయని భావించవలసియున్నది. ఇదియునుగాక కొం దరు సముద్ర గర్భములోనో, అగ్ని ప్రమాదములోనో, నదీ జలప్రవాహములలోనో ఇతర ప్రయాణ ప్రమాదములలో చని పోవుచున్నారు. వారి బంధువులకు ఆవార్త తెలిసిన ప్పుడే కర్మ నాచరించుచున్నారు.

మరికొందరు మశూచి, కలరా ఇత్యాది అంటు వ్యాధులవల్ల మరణించుచున్నారు. అట్లు మరణించిన జీవులు పరలోకమునకు వెంటనే ప్రయాణము చేయలేక ఈ లోకములోనే తిరుగాడు చుండును. ముఖ్యకారణం ఆజీవికి ఏవిధమైన పరికరములు అనగా గాలి, వెలుతురు ఇత్యాదివి ఆకర్షించు శక్తి లేక యుండును. అందువల్లనే వాటికి ఏవిధమైన కర్మలు వెంటనే చేయక ఆజీవి నివసించు ప్రాంతమంతయు దోషరహితమైన పిమ్మట కర్మచేయుచున్నారు. ఇదియును గాక ప్రసవవేదన వల్లనో, బాలింతవ్యాధి వల్లనో చనిపోయిన జీవులు అకస్మాత్తుగా అకారణముగా చనిపోయినట్లు భావింపబడుచున్నవి. అట్టి జీవులకు చేసిన కర్మల ఫలితము చేరుట లేదు. ముఖ్యకారణము ఆ జీవులలో ఆకర్షణశక్తి పూర్తిగా నశించినందున చేయు కర్మల ఫలితము పొందుట లేదు. ఇదియునుగాక అవి దీర్ఘకాలమువరకు ప్రయాణము చేయలేక ఈ భూప్రపంచమునందే తిరుగాడుచున్నవి. అంతే ఆ సూక్ష్మజీవులకు గాలిలో ఎగురు శక్తి కొంత దీర్ఘకాలమువరకుం లభించుట లేదు. ఈ విధముగా జీవియొక్క ప్రయాణగాథ యున్నది. మరిన్ని చేయుకర్మ విధానములు అనేక మతస్థులు అనేక విధములుగా ఆచరించుచున్నారు. ఏవిధముగా ఆచరించినను ఫలితము ఒకటే పిమ్మట ఈ జీవి ఎందుకు ప్రయాణముచేసి పరలోకమునకు చేరుచున్నది అని విచారిద్దాము. అంతేగాని ఈజీవి శరీరములో నుంచి దేవదూతలు గాని యమభటులు గాని ఉచ్చులు వేసి శరీరములో నుంచి లాగుచున్నారని

వారివెంట జీవి ప్రయాణము చేయుచున్నది అని చేయుచున్న వర్ణన అతిశయోక్తిగా భావించవద్దు. ఈప్రయాణ సమయమున జీవి ఎంత ప్రమాణములో యుండును. ఏరూపములో యుండును అను విషయము వర్ణించెదము.

దానికి రూపురేఖలు లేవుగాని అది ఒక అంగుళము ప్రమాణములో యుండునని చెప్పవలసి యున్నది. అట్టి జీవి ప్రయాణము చేయునప్పుడు మనము ప్రయాణము చేయునప్పుడు ఇతరప్రయాణీకులతో కలసి సంభాషించుకొనుచున్నట్లే ఆజీవులుకూడా సంభాషించుకొనుచు పోవుదురు. పరదేశమునకు వెళ్లినప్పుడు వారి భాష మనకు తెలియనప్పుడు ఏవిధముగా బాధపడుచూ మనభావములు ఇతరులకు అర్థమగునట్లు సంజ్ఞలు రూపమున చూపిస్తామో, ఇద్దరు మాగ వారు ఏవిధముగా మాట్లాడు కొందురో ఆ విధముగా మాట్లాడుకొనుచూ పరలోకమునకు చేరెదరు. అచ్చట చేరిన వెంటనే ఆప్రాంతములో కొంతకాలము ప్రయాణ బడలిక తీర్చుకొనుచూ చేరినవారు సమావేశములు చేసికొనుచూ వారి వారి పరిచయ భాషలను ఇతరులకు నేర్పుచూ యుందురు. అట్లు మందలు మందలుగా గొర్రెలను కటిక దుకాణమునకు ఒకడు తోలుకొని వెళ్లునట్లుగా వీళ్లను ఆ ప్రాంతములోని ధర్మశాలలకు తోలుకొని పోవుదురు. అచ్చట వీరి వీరి పూర్వ చరిత్రలు అనగా జీవిత కాలములో ఆచరించిన ధర్మా ధర్మములు ఆజీవి ఒక అద్దములో తన ముఖము చూచుకొనినప్పుడు తన రూపమే గనినట్లుగా తన బాల్యము

నుండి అంత్యమునగను ఆచరించిన సమస్త విషయములు ఆజీవి మనసుగుండా ఎదుటనున్న వారికి అనగా ఆలోకములో నివసించుచున్న ధర్మపరిపాలనులకు గోచరమగును. ఆజీవికి ప్రత్యామ్నాయముగా కలుగవలసిన ఫలితమును అచ్చటివారు నిర్ణయించి పంపివేయుదురు. అట్లు పంపబడిన వారు ఆ ప్రాంతమున 7, 8 మాసములవరకూ తిరుగుచూ పిమ్మట ఆలోకమునుండి ఆజీవికి నిర్ణయింపబడినజన్మప్రాప్తికి అవసర ఏర్పాటులు చేయబడి ఆ ప్రాంతమును వీడి తిర్గు ప్రయాణము చేయును. మనము ఒకరోజున సినిమాకో మరి ఏ ఇతర ప్రదర్శనమునకో వెళ్లి తిర్గి ఇంటికి చేరినట్లుగా ఆజీవి ఈ భూలోకమునకు రాగలదు. ఇది రెండవఘట్టము.
20-3-75.

## మూడవ అధ్యాయము

ఈజీవి పైవిధముగా ప్రయాణముచేసి తిరిగి భూలోకములో ఏ రూపములోనో అనగా పశుపక్ష్యాది క్రిమి కీటకములుగానో ఉత్తమ మానవజన్మము లేక అధమ మానవజన్మయో లభించుచున్నది. తల్లిగర్భమున మోయబడి జననమందు బాల్యయవ్వన కౌమారదశలను పొందుచున్నది. ఇట్టి జీవికి రూపురేఖలు లేకపోయినను పరలోకమునుండి వచ్చి ఆతల్లి గర్భములో ఏవిధముగా ప్రవేశించుచున్నది యనెడి ప్రశ్నకు వద్దాము. తల్లిగర్భవతి యయినకొలది కాలమునకు శరీర అవయవములు రూపము దాల్చగానే జీవి ఆహార పదార్థముల గుండా గర్భములో ప్రవే

శించి ఆ గర్భములో యున్న మాంసపు ముద్దలో నడిభాగమున ప్రవేశించును. ఇది ప్రవేశించిన నాటినుండి ఆశరీరములోని మాంసపుముద్ద పిండముగా మారుచూ తల్లి స్వరూపమును బడయును. అంటే తల్లి మనిషి అయిన మనిషిగాను, జంతువైన ఆ జంతురూపములోను లేక పక్షి అయిన ఆపక్షిరూపములోను దినదిన క్రమముగా పెరుగుచూ సర్వ అవయవములు బడసిన పిమ్మట గర్భములో ప్రసవ వేదన ప్రారంభమై జననమందును. ఇట్లు జనన మందినప్పుడు తల్లిదండ్రులు, బంధువులు వారికుటుంబములో ఇంకొక సభ్యులు లభించినారని ఆనందించుచున్నారు. ఇట్లు ఆనందింపబడిన శిశువే పెరిగి పెద్దదై యవ్వనమును బడయుచున్నది.

ఈవిధముగా జీవితక్రమము అనాదినుండి నేటివరకూ కాలవాహినిగా జరుగుచున్నది. ఈకాలవాహినికి మొదలు గాని తుదికాని లేదు. మరిన్నీ సమస్త జీవరాసులు ధర్మములనే పాటించుచున్నవి. కాని ఒకొకప్పుడు తల్లిగర్భమున అంగహీనులుకూడా జన్మించుచున్నారంటే పరలోకమునో వీరికి నిర్ణయింపబడిన నిర్ణయములేకాని వేరుకాదు. గుడ్డివాడు మూగవాడుకూడా పై కారణమువల్లనే జనించుచున్నారు. మరిన్నీ ప్రతి జీవి ప్రతిరోజూ ఏదో ఒక కార్యార్థము ఏదో ఒకచోటికి వెడలు ఆచారముగలదు. అట్లు వెడలినప్పుడు మార్గమధ్యమున కాని వెళ్ళినప్రదేశమునగాని ఈజీవికి కొంత సహాకారమో లేక అపకారమో జరుగుచుండును. అదికూడా పరలోక శాసనముల ఫలితమే గనుక

జీవి ఎల్లప్పుడు మెళుకవతో ఏదోషములు చేయకుండా జీవయాత్ర గడుపుట ప్రయత్నించవలసి యున్నది. అందుకే మానవులు పురాణములు, ధర్మశాస్త్ర మీమాంస సభలు జరుపుకొనుచూ ప్రాణి ఈ శరీరముతో ఎట్టి దుష్టకార్యములను చేయకుండునట్లు, తన స్వశక్తితో ప్రవర్తించవలసి యుండును. గనుక జీవుడు ఎల్లకాలము సత్సాంగత్యముతో నుండుటకు ప్రయత్నించవలెను. ఆవు తన పాలను దూడకు ఇచ్చునట్లుగా, మనతల్లిపాలను మనముత్రాగినట్లుగా గురువులవద్ద ధర్మమార్గములను కూడా నేర్చుకొను చుండవలెను. అట్లు నేర్చుకొని నప్పుడు తల్లియొక్క లక్షణములు, గుణములు శిశువునకు ఏర్పడగలవు. ఏనుగు పరుండినప్పుడు ఎలుక దాని శరీరము మీద ప్రయాణము చేయుచుండును. అట్లు చేసి చేసి అలసి ఒకచోట నిద్రించును. అట్టి నిదురయే ఈ మానవ లోకమున ప్రజలచే గుర్తించ బడుచున్నది. మానవుడు చింత కలిగినప్పుడు ధన, బంధు వియోగమువల్ల కాని మరి ఏ ఇతర కారణముల వల్ల గాని జరిగినప్పుడు దైవమును తలంచుచున్నాడు. ఆ దైవమే ఒకనాడు తనకు ఐశ్వర్యమును కలుగ చేసినప్పుడు దైవమును మరచి అది యంతయు తన ప్రభావమని విర్రవీగుచున్నాడు. ఈ దోషము లన్నియూ రేపు చర్చిద్దాము.

(21-3-75)

## నాలుగవ అధ్యాయము

ఈరోజు నేను చెప్పబోవు విషయం ముఖ్యముగా ఆత్మకు జీవికిగల బేధము ఏమిటి? ఇది రెండు పేర్లతో పిలువబడుటకుగల హేతువు చెబుతాను.

జీవి, జీవితకాల పర్యంతం శరీర అవయవములను నడిపించుచుండును. అంటే ఒక ఇంజను సహాయముతో కొన్ని రైలు పెట్టెలు నడుచుచున్నవి. కాని ఈ జీవిలోని బొగ్గు, నీరు, తగ్గగానే ఇందువల్ల ఉత్పత్తి యగు ఆవిరి సమసిపోయినందున రైలు ఇంజను పనిచేయలేదు. అది నిస్సహాయున్ని అయినందున రైలుపెట్టెలను కాని తానుగాని ఉన్న స్థలము నుండికదలలేవు. ఇందుకు ముఖ్యకారణము ఇంజనుకు అవసర వస్తువైన ఆవిరి ఉత్పత్తి లేకపోవుటయే. ఆవిరి యనునది ఎక్కడనుంచి వచ్చినది. బొగ్గులలో దాగియున్నదా లేక నీటిలో దాగియున్నదా లేక ఈరెండునుగాక బొగ్గుకు తోడ్పడిన అగ్నివల్లనా అంటే బొగ్గు, నీళ్లు నిప్పులు మిళితమై వాటివాటి ధర్మములు నాచరించినప్పుడు వాటిమూడింటి ప్రభావమువల్ల ఆవిరి ఉత్పత్తిఅయి, ఆ ఆవిరి బయటకు వెళ్లుటకు మార్గములను వెతుకగా ఆ ఇంజనులోని పిస్టన్సులోని మరుగుగాయున్న ఖాళీ ప్రదేశములోనుంచి బైటకు తోయబడుటచే పిస్టనులు జరిగి ఇంజను నడుచుచున్నది. అట్టి ఇంజనే ఈశరీరము. ఈ నడుపుశక్తియే జీవియొక్క కార్యక్రమము. వీటికి తోడ్పడు ఆవిరియే ఆత్మయని భావించండి. అటులనే జీవి ఆత్మచైతన్యముచే ప్రయాణము చేయు

చున్నది. పరలోకములకు చేరుచున్నది గనుక ఆత్మలోని ఒక అంతర్ భాగమునే జీవియని పిలుచుచున్నట్లు భావింప వలసియున్నది. అందుకనే జీవాత్మయని నామము వచ్చినది. కొందరు మేధావులు జీవి వేరు ఆత్మ వేరు. పరలోకమునకు వెడలునది ఆత్మ కాదు జీవియే యనియు, శిక్ష అనుభవించు నదికూడా జీవియేయనియు ఈ ఆత్మ శరీరములోనుంచి జీవి బైటకురాగానే అందులోని ఆత్మ పదార్థము గాలిలో మిళిత మగుచున్నదనియు తిరిగి యీజీవి గర్భములో శిశురూపము దాల్చి భూమిమీద పడగానే యీ ఆకాశము లేక గాలిలో నుంచి ఒక పదార్థము అంటే ఆత్మ అనేది జీవియొక్క శరీరములోనికి ప్రవేశించుననియు, ప్రవేశించగానే జీవి ఏడ్చుననియు, అంతవరకు జీవికి ధ్వని చేయు శక్తి లేదనియు, కొందరి పెద్దల అభిప్రాయము గనుక జీవికి ఆత్మకు అవినా భావసంబంధము యున్నదని తేలుచున్నది. వ్యవహారిక భాషలో జీవినే ఆత్మయని, ఆత్మనే జీవియని పిలుచుట సంభవించుచున్నది. మరి యీరోజున మనము చర్చించ వలసిన మరి ఒక విషయము యేమనగా యీ మానవుడు జననమందగానే నాబిడ్డయని. ఆబిడ్డకు కావలసిన పరిచర్య లన్నియు ఎంతో ప్రేమభావముతో తల్లి చేయుచున్నది. ఇదే తనబిడ్డ కానియెడల చేయుట లేదు. ఈ ప్రేమభావము కలుగుటవల్లనే గర్భము ధరించినప్పటినుంచి అతి జాగ్రత్తగ జీవయాత్ర చేయుచూ, గర్భములోని శిశువు పోషణకు తోడ్పడుచూ, శిశుదర్శనమైనప్పటినుండి ఆ బిడ్డకు కావలసిన బాధ్యతలన్నియు స్వీకరించుచున్నదంటే ఆభావన కలుగ

జేసినది ఆ దైవకృపయే యని భావించవలెను. ఎందువల్ల ననగా శిశువు జననమందిన ఘడియనుండి తల్లి స్తనముల గుండా శిశుపోషణకు అవసరమైన పాలను ఆ దైవమే కలుగ జేయుచున్నాడు. కాబట్టి యీ విధముగా శిశువు బాలబాలి కలుగా మారి ఆహార వస్తువులను స్వశక్తితో పొంద అల వడగానే తల్లి బాధ్యత చాలవరకు ముగియుచున్నది. అందు వల్లనే శిశువుకు మాతృభక్తి మిక్కుటముగా యుండును. తరువాత ఈ జీవికి విద్యాజ్ఞానములు అలవడినకొలది తన లోని జ్ఞానమును పెరుగుచూ వచ్చును. ఇది అంతయు ఆ పరమాత్మప్రభావమే. ఇట్లే ప్రతి జీవజంతువు, పక్షులు, క్రిమికీటకములు వాటివాటి ధర్మములను పాటించుచున్నవి. ఇది నేటి విషయము.

22—3—75.

## ఐదవ అధ్యాయము

మానవులు, జంతువులవలెగాక జ్ఞానవంతులగుటచే జననమందినది లగాయతు మరణకాలము వరకు కర్మ కాండలు జరుపుచున్నారు. ఇట్లు జరుపుకొనుట అనాది సిద్ధమైన ఆచారము, వేదధర్మము అయియున్నది. ఇతర జీవరాసులకు కర్మకాండలు లేనప్పుడు మానవులకు మాత్రము ఈ కర్మకాండలు ఎందుకు? అవలంబించిన అధిక ఫలితమేమి? అవలంబించని యెడల కలుగుదోషమేమి యను విషయమే మన నేటి సమస్యా విషయం. ప్రతిమానవుడు

ఏదోఒక రోజున చనిపోవువాడేగదా! ఆ చనిపోవు జీవి పరలోకమునకు ప్రయాణముచేయక తప్పదు. ఆ ప్రయాణము చేయుటకు అనువుగా కొన్ని సదుపాయములు మానవుడు హావిస్సుల రూపముగా మంత్రోచ్చారణతతో చేయుచున్నాడు ఇట్లుచేయుటవల్ల జీవి సునాయాసముగా ప్రయాణము చేయగలడని భావన. ఇంకా దీర్ఘముగా ఆలోచిస్తే ప్రతిజీవి మరణించగానే ఆప్రాంతములోనే తిరుగాడు నప్పుడు మురికినీళ్ళు ఇత్యాదివి అనుభవించిన యెడల ప్రయాణవేగము సన్నగిల్లునని భావన.

ఇంకో విషయెం ఏమిటంటే అన్ని జీవులు ఒకే పర్యాయము మరణించినప్పుడు అనగా గుంపులు గుంపులుగా ప్రమాదములవల్ల మరణించినప్పుడు ఆజీవులకు ఎవరూ కర్మచేయుటకు అవకాశముండదు గనుక అట్టితరి ఈ కర్మ విధానము లభించుటలేదు. అంతమాత్రమున అసలుకర్మ విధానము ఎందుకు ఆచరించవలెను అనెడి ప్రశ్నకు జవాబు ఏమనగా అవకాశమున్నంత వరకూ జరుపుట ఉత్తమముగా భావించండి. ఇదియునుగాక చనిపోయిన జీవి నలభైరోజులు ఈ ప్రదేశముననే తిరుగాడుచుండి నప్పుడు మొదటి పది, పదిహేను రోజులు మాత్రమే కర్మ ఎందుకు ఆచరించుచున్నారు అంటే కర్మ విధానము దృష్ట్యా చేయవలసినది హిందువులు అంతవరకేయని భావించుచున్నారు. అన్యమతస్థులు ఇంకా దీర్ఘకాలముగా భావించి ఆచరించుచున్నారు.

ఇకను ఏ దేశములోనో నడిసముద్రములోనో యుద్ధ భూమియందో చనిపోయిన జీవి బంధువులకు వార్త తెలిసి నపుడు ఆచరించుచున్నారంటే వారికి కర్మవిధానమందు గల భక్తి గౌరవమును ప్రకటించుట మాత్రమే యని భావించవలసి యున్నది. ఈ విధముగా భూలోకములో ఆచరింపబడు విధానములు పలువిధములై యున్నవి. ఎవరు ఏవిధముగా ఆచరించినను భావము ఒకటేయని గుర్తించండి.

గోదానము చనిపోయిన వారి పేరిట ఇస్తారు. ఇది హిందువుల ఆచారము. ఈ ఆచారమునకు మూల కార ణము సర్వ దోషములు హరించి జీవి సుఖముగా ప్రయాణము చేయగలడని భావన. ఈ భావనతో ఒక హిందువులు మాత్రమే ఆచరించుచున్నారు. అట్లు ఆచరించునప్పుడు ఆ గోవు పవిత్ర వస్తువు అని దాని తోక వెంట జీవి పరలోకములోకి ప్రయాణము చేయుట సులభ మని భావన. ఇది సరియయిన సమాధానము కాదు. దాన మిచ్చిన జీవి యీ ప్రాంతమందే యుండునుగదా! దాన ఫలము వారికి తోడ్పడును, అంటే అది వారు వారి జీవిత కాలములో చేయక వారి జీవితానంతరము బంధువులచే జరుపబడుచున్నది. గనుక ఆ ఫలితము జరిపిన వారికేగాని చనిపోయిన జీవికి లభించునా లేదా యనెడి విషయం సందేహాస్పదం. యీ విధముగా కర్మ విధాన క్రమము జరుపబడుచున్నది అనాది కాలము నుంచి.

మానవుడు లేక జీవి ప్రయాణము చేసి చేసి పర లోకము చేరిన పిమ్మట కొంత కాలము విశ్రాంతి తీసుకొనును అని అనుకున్నాము గదా. అది ఎందుకు అంటే ఆ జీవి పర లోకములోని ధర్మమార్గములను పరిత్యక్తముగాగని ఉత్తర జన్మలలో ధర్మ యుక్తముగా ప్రవర్తించుటకు అని భావించబడెను—23-3-75.

## ఆరవ అధ్యాయము

ఈనాడు మన చర్చనీయాంశ మేమనగా మానవుడు చేయు కర్మకు ఈలోకంలో శిక్ష లభించక దీనికొరకు పర లోకములో విచారించ బడుటకు కారణమేమిటి? ఈ లోక ములో ప్రభుత్వ పరిపాలకులచే కొన్ని నేరములకు శిక్ష లభించుచున్నవిగదా? వాటిని గురించి పరలోకములో మినహాయింపులు వచ్చుచున్నవా? ఈ విషయమై ముఖ్య ముగా నేను చెప్పునది ఏమనగా ఒక నేరమునకు రెండు శిక్షలు యుండవు, ప్రభుత్వదృష్టినుండి తప్పించుకొన్న నేర ములకే గాక రాజ్యాంగ సంబంధముగాని ఇతర నేరములకు పరలోకములో విచారించి తీర్మానింపబడును. అక్కడ తీర్మానములు ఏవిధముగా యుండుననగా ఒకనిని డొక్కలో కత్తిపెట్టి నీవు పొడచినప్పుడు రాబోవు జన్మలో నీకు శూల నొప్పియో మరి ఏవిధమైన కడుపునొప్పి బాధయో ప్రాప్తిం చును. నీవు పరస్త్రీ సాంగత్యము చేసినప్పుడు నీ అంగము నకు వివిధరకముల వ్యాధులు సంభవించుటయే గాక పర లోకములో నీకు మరు జన్మలో సంతానప్రాప్తి యుండదు.

ఒకరి ఆస్తి అపహరించిన యెడల మరుజన్మలో నీవు ఆకలి బాధలతో జీవయాత్ర చేయవలసి యుండును. నీవు సత్య ప్రవర్తకుడవై పరోపకారము చేసిన యెడల మరుజన్మలో ఐశ్వర్యవంతుడవై యుండెదవు.

ఈవిధముగానే ప్రతి మంచిచెడుగులకు ఫలితము లభించగలదు. ఇదియునుగాక మానవుడు జీవహింస చేయుచూ భుజించుచూ యుండిన యెడల మరుజన్మలో ఆమానవుడు ఒక కోడిగానో, పశువుగానే, జలచరముగానో జననమొంది ఆనాడు తను చేతులారా చేసిన విధమును తానే అనుభవించును. ఇవి శిక్షలు పరోక్షముగా చేసినను రహస్యముగా చేసినను పరలోకములో ఫలితము సంభవించును. కొన్ని రాజశాసనములలో తప్పు కాని విషయములు పరలోకములో నేరములుగా భావింపబడి శిక్షింపబడును, అటులనే అనేక మంచికార్యములకు తగిన ఫలితములుకూడా ప్రాప్తించుచుండును. ఇదియునుగాక నేరములకు భూలోకములో లంచములుఇచ్చి పెద్దమనుష్యులవలె ప్రవర్తించువారుకూడ వాటి ఫలితములను అనుభవించక తప్పదు. మరిన్ని భూలోకములో ప్రభుత్వ సిబ్బందిగా యుండి ధర్మ విరుద్ధముగా వారి అధికారమును వినియోగించిన వారుకూడా శిక్షలు పొందుచున్నారు. ఒకడు తన భార్యను జారవతి యని నిందలువేసి ఆమె జీవితమునకు లేనిపోని అడ్డంకులు కలుగచేసి భార్యను పోషించక విడచువారుకూడా ఆ పరలోకములో ప్రతి ఫలమును పొందుచున్నారు. అంతేగాని అక్కడ యమలోకంగాని రంభా

సంభోగములు ఇత్యాదివికాని లేవని నమ్మండి. మానవుడు సాధారణ జ్ఞానము కలిగిన వారు నేరములు చేయకుండా యుండుటకు గాను పురాణములలో వర్ణింపబడిన యమ లోకమే గాని వేరు కాదు. ఇంకొక విషయం జీవి చనిపోయినపిమ్మట పరలోకం చేరులోపల జీవికి ఆహారం అవసరము లేదా అంటే గాలిమాత్రమే చాలునని, ఆకాశమునుండి వచ్చు గాలి చాలును అని భావించండి.



24—3—75.



## ఏడవ అధ్యాయము

ఈ ప్రపంచములో నానాజాతులు అని పిలువబడు మనుష్యులందరు ఒకే విధముగా తల్లిగర్భము నుండి జనించినారు. జనించబోవుచున్నారు. అయినప్పటికి జాతి భేదములు. మతభేదములు, దేశభేదములు ఆధారముగా చేసుకుని కీచులాడుకొనుచూ ఎవరికివారు తామే గొప్ప వంశీకులమని భావించుచున్నారు. యీ భేదములన్నియు గ్రహించుచున్న ఆ పరమాత్మ ఏమంటున్నాడంటే మీ భేదములకు మూలకారణము అజ్ఞానము. మీలో అజ్ఞానమునెడి ఒక మబ్బుతెర కప్పబడియున్నది. జ్ఞానవంతులై ఆ తెరను చీల్చివేసి వెనుకనున్న జ్ఞానజ్యోతిని చూచి మీలోని దోషమును మరువండి. యీ తెర మబ్బువంటిది. మబ్బువెనుక సూర్యుడు దేదీప్యమానముగా వెలుగుచున్నాడు. ఈ మబ్బువల్ల చూచువారికి కొంతసేపు కాంతిహీనునిగాను, కొంత

నేవు కాంతి వంతునిగాను, కాన్పించుచున్నాడు. ఇదియును గాక ఆసూర్యుడే వేసవికాలములో తీక్షణముగాను వర్షాకాలములో కోమలముగాను మనకు కన్పించుచున్నాడంటే అది మనదృష్టి దోషమే గాని ఆసూర్యునిలో మార్పులేదు ఈ దృష్టిదోషము కండ్లజోడు ధరించిన పోవునది కాదు. Microscopes ధరించిన మారునది కాదు. ఆత్మజ్ఞానము కలిగినప్పుడు నీవు ధరించిన వస్త్రములోని మురికి నీకు కన్పడదు, అటులనే ప్రాపంచకదృష్టి నశించినప్పుడు నీకు ఆ పరమాత్మ దృష్టి లభించి, ఆత్మజ్ఞానము లభించును. ఇది నేటి నా సందేశము. (25-1-75.)

## ఎనిమిదవ అధ్యాయము

బహు దూరప్రదేశములలో నివసించు బంధువులు మృతిచెందినవార్త వినినప్పుడు నీవు ఇక్కడ చేయు కర్మలు ఆజీవికి ఎట్లుచెందును అనే విషయసమస్యను గురించి నేడు చర్చిద్దాము.

దూరప్రదేశములో జనిపోయిన వారి జీవి ఆ యా ప్రాంతములందే తిరుగాడును కాని, బంధువుల కర్మ స్వీకారమునకుగాను రాదు. అందువల్లనే చనిపోయిన ప్రాంతమునకే దూరస్థులు వెళ్లి అచ్చట కర్మకాండలు నిర్వహించి వారి ప్రాంతములకు తిరిగి వచ్చుచున్నారు.

అదియునుగాక మానవుడు ప్రయాణము చేయుటకు అవకాశమున్న ప్రదేశమునకు వెళ్లి ఆచరించు చున్నాడు. అదియునుగాక నదీ గర్భములోనో సముద్రము లోనో

విమానయాత్ర చేయుచూ ఏ ప్రదేశములోనో మృతి చెందు చున్నాడు. యుద్ధభూమియందు ప్రవేశించ వలవిగాని ప్రదేశములకు వెళ్లుటకు సాధ్యపడనందున బంధువు తన నివాసస్థానముననే జరుపుచున్నాడంటే ఇది మనస్సు తృప్తి కొరకు బంధుప్రీతినిమిత్తమే యని భావించవలసి యున్నది. ఇది యిట్లుండగా ఒకనాడు స్వగృహములో చనిపోయినను ఆప్తబంధువు రాలేనప్పుడు ఆయనపేర కర్మము పెట్టి యితరులు ఆచరించుచున్నారు. కర్త బాలుడైనప్పుడుకూడా అన్యులు ఆచరించుచున్నారు. ఈ కర్మల ఫలితములు చని పోయినవారికి చేరగలవు. ఉదాహరణకు చూడుడీ ఒక బాలుని తండ్రి చనిపోయినప్పుడు ఆ బాలునిపేర కర్మము పెట్టి బంధువులుగాని ఇతరులుగాని కర్మచేయుచున్నారంటే కర్మవిధానము ధర్మమైనదేయని ఆకర్మఫలము చనిపోయిన వానికి చెందునని భావించవలసియున్నది. మన దేశములో యీ కర్మవిధానమున్నది. కొన్ని దేశములలో కర్మ విధానము మరుగైయున్నది. ఇంగ్లీషువారు చనిపోయిన జీవి కళేబరమును భూమిలో పాతివేయుచున్నారుగాని వేరు కర్మ లేదు. అయినను ఆ జీవికూడా పరలోకమునకు చేరు చునేయున్నది అని భావించండి. ఇది నేటి నా సందేశము.

(26—3—75.)

## తొమ్మిదవ అధ్యాయము

నానాజాతులు అనబడువా రందరూ ఒకే మానవ జాతికి చెందినవారే అయినప్పటికి వారివారి ప్రాంతములను

బట్టి వంశ పరంపరావచ్చు ఆచారములనుబట్టి, భుజించు ఆహారపదార్థములనుబట్టి, చేయు వృత్తులనుబట్టి వేరువేరుగా భావింప బడుచున్నప్పటికి వీరందరూ మానవులే. వీరిలో మూగవారు, చెవిటివారు అంగహీనులు వేరుజాతికి చెందిన వారుకాదు. అంటే ప్రతిజాతిలోను ఇట్టిదోషము గలవారు యుండవచ్చును. వీరందరు కొన్ని ధర్మములను విధిగా ఆచరించుచున్నారు. 1. తినుట లేక భుజించుట, 2. నిద్రించుటకు 3. స్త్రీపురుష సంపర్కము. 4. మలమును విసర్జించుట, అయినప్పటికిన్ని వీరిలో ఏ దోషములు లేనప్పటికిన్ని వీరిలో కొందరు శిక్షార్హులగుచున్నారు అంటే వారిలోని ప్రవర్తనా దోషములే ముఖ్యకారణము. అట్టి దోషములను గురించి నేడు చర్చిద్దాము. 1. పరస్త్రీ సంపర్కము. 2. పరపురుష సంపర్కము. 3. మిత్రద్రోహము. 4. నమ్మకద్రోహము, 5. గురుద్రోహము, అంటే గురువుయందు ఉండవలసిన భక్తి గౌరవము విధేయత, గురుసేవ, గురుఆజ్ఞల నుల్లంఘించుట 6. పితృద్రోహము అనగా తల్లిదండ్రుల బోధల తిరస్కరించుట, వారియందు అనాదరణ, వారువృద్ధులైనప్పుడు వారి రక్షణ, 7. తనవారేయనిగాక తన పొరుగువారియందు దయ, జాలి, ప్రేమ కలిగి ప్రవర్తించుట, మనలకు సృష్టికర్త, పోషణకర్త ఒకరు యున్నారని తలంపక మైమరచి ప్రవర్తించుట ఇత్యాది దోషములు చేయుచూ వాటి ఫలితమును ఈజన్మలోనేగాక ఉత్తర జన్మలో కుష్టు, గుడ్డి ఇత్యాది రూపములలో అనుభవించుచున్నారు. గనుక జ్ఞానవంతులై పై దోషముల బారినుండి వైదొలగి జాగ్ర

త్తగా జీవి సంచరించవలసి యున్నది. అట్లు సంచరించని నాడు పై దోషముల ఫలితము అనుభవించక తప్పదు.

27-3-75

## పదవ అధ్యాయము

పుష్పవికసకముందే మొగ్గయొక్క లక్షణములను బట్టి ఇది చామంతి పువ్వు, ఇది మల్లెపువ్వు అని మనము నిర్ణయించుచున్నాము గదా! అటులనే జననమందిన శిశువు బాలుడైనంత మాత్రముననే వానియొక్క నడవడికలు, ప్రవర్తనలను బట్టి వాని లక్షణములను మనము నిర్ణయించుచున్నాము. అది ఎట్లన ఆ కుమారునికి లభించుచున్న విద్యావిధానము, పెద్దలయందుచూపు వినయవిధేయతలు, తల్లిదండ్రుల ఆజ్ఞలను పాటించుట, ఆహార నియమములు ఇత్యాది ప్రవర్తనలే మార్గములైయున్న మేలు రీత్యావలె ఆ బాలుని భవిష్యత్తు చాలావరకు నిర్ణయించ వచ్చును.

ఇటులనే జీవజంతువుల అన్నింటి ప్రవర్తన గుర్తించ వచ్చును. ఒక ఆవు సాధువైనప్పుడు దానిని తాకినను ఏమీచేయదు. సాధువుకాని ఎడల పొడచును. మానవుని పశువులతో పోల్చి చెప్పినానని భావించవద్దు. భుజించు ఆహారములోకూడ తేడాయుండును. చలిచీమలు ప్రతిరోజు ప్రత్యేకముగా ఎండాకాలములో ఎండలకు తట్టుకొనలేక చల్లటిప్రదేశమునకు ప్రయాణముచేయును. నీటి జంతువులు ఎండకాలం రాగానే వాటి మడుగులలోని నీరు ఎండిపోవున్న

భావించి దూరములోయున్న వేరు ప్రదేశమునకు చేరు చున్నవి, మానవుడుకూడ పంటధాన్యమును జాగ్రత్త పరు చుకొనుచున్నాడు. ఇట్టిజ్ఞానము ప్రతి జీవజంతువునకు ఉన్నది కాని ఒకే కాలమున ఆచరించు వివిధ ధర్మములు సర్వ కాలముల రక్షణకొరకు జరుపుకొను చున్నాముగాని ఈ శరీరములోయున్న జీవి ఏరోజున ఈ శరీరమును బాసి వెడ లునో యని, దానికి అవసరమైన జాగ్రత్త పొందుట లేదు. జాగ్రత్త పొందుట లేదు అంటే చనిపోయిన పిమ్మట ఈ జీవికి ప్రాప్తించు విషయములను గురించి చింతించుట లేదు. అట్లు చింతించక ఈ భూలోక జీవితమే శాశ్వతమని భావించి, భార్యా బిడ్డలని మునిగి తేలుచున్నారు. ఈ జీవి మరణించి నపుడు అనగా ఈ శరీరమునుంచి బయటకు రాగానే బం ధువులందరు ప్రత్యక్షముగా చూచుచున్నను, చనిపోవు చున్న బంధువు నాకు ఏమీ చెప్పలేదని మిగిలిన ఆస్తిపాస్తు లను పంచుకొనుటకుగాను బాధపడుచూ, ఒకరిపై ఒకరు ద్వేషభావములను పెంచుకొనుచూ ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ పరుగిడి వారి తీర్పులకొరకు వీరి జీవితములో కొంత భాగ మును వ్యయపరచుచున్నారు కాని వారిలాగానే నేనుకూడా ఒకనాడు మరణించవలసినదేనని దైవభావము కలిగి ప్రవ ర్తించుటలేదు. అట్లు ప్రవర్తించనందువల్లన ప్రతిజీవి గొర్రెలమందలు కటికి దుకాణమునకు దారులుతీసి వెళ్లు చున్నట్లుగా ఈ భూలోకమును వీడి చనుచున్నారు. కనుక మానవజాతులలో బహు స్వల్పమంది కృషిచేసి ఆర్జించు

చున్న ఈ ఆధ్యాత్మిక జ్ఞానమును తెలుసుకొని అందలి బోధలను ఆచరించి తరించండి. 28-3-75.

## పదకొండవ అధ్యాయము

ఈనాటి మన సమస్య ఏమనగా ప్రతి జీవి ఏదో ఒక రోజున మరణించవలసినదే తిరిగి పుట్టుట కొంత కాలమునకో జననమందవలసినదే. అంటే బండిచక్రమువలె తిరుగుచుండవలసినదేనా? దీనికి విశ్రాంతి కాలము లేదా? ఇట్లా ఎంత కాలము తిరుగుతూ యుండవలెను. బాగా తిరిగి బండీ చక్రం శిథిలమై పోవును గాని ఈజీవికి మాత్రం క్షీణించక ఉండిన యెడల ఎప్పుడు నవవిధమైన మాత్ర క్షీణించదు [illegible] విషయం.

ఒక రోజు ఉదయంపూట నిద్ర లేచిన వెంటనే దంతధావనం చేసుకొంటున్నాము. పిమ్మట మన పనులను గాను అనేక వృత్తులు ఆచరించి, ఆ వృత్తుల ద్వారా ఆర్జించిన ధనసంపత్తితో గృహమునకు కావలసిన పోషక వస్తువులు ఇత్యాదిని కొనుక్కొని అనుభవించుచున్నాము. ఇలా జీవిత పర్యంతం చేస్తూయున్నాము. దీనికి మాత్రం అంతు కనబడటం లేదు. నీ శరీరములోని బలము తగ్గినప్పుడు నీ అవసరవస్తువుల సంఖ్య తగ్గించుకొని, నీవు ప్రాప్తించిన వాటితోనే తృప్తిపడుచున్నావు. ఇట్లే అవకాశము దొరకనప్పుడల్లా నిద్రించుచున్నావు తిరిగి మేల్కొని పనిచేయుచున్నావు. ఈ చేయు చర్యలన్నియు నీ శరీరములో జీవి

యున్నంతవరకూ చేయుచున్నావు. అట్లాగే జన్మలు పరం పరలుగా ఎత్తుచూ బాల్య యవ్వన కౌమార దశలు అనుభవించి పిమ్మట చనిపోవుచున్నావు. చనిపోయినప్పుడు పరలోకమునకు వెళ్లుచూ అచ్చట విచారణానంతరం తిర్గి జన్మ ఎత్తుచున్నావు. అట్లు విచారణ జరుపబడు నప్పుడు మొదటి జన్మలో నీవు యేమైై తప్పులు చేసి దోషములకు శిక్ష పొందుచున్నావు నీవు రెండోసారి వెళ్ళినప్పుడు ఈలోకములో గత జన్మ జ్ఞానంచే తప్పులు తక్కువ చేయుచున్నావు.

ఉదాహరణకు ఒక కథ చూపినది వ్రాయమంటే మొదటిపర్యాయం 15 తప్పులతో వ్రాస్తే రెండోసారి వ్రాసి నప్పుడు అనుభవమువల్ల 12 తప్పులతో వ్రాయుచుండగలుగు చున్నావు. ఈవిధముగా వ్రాయగా వ్రాయగా సాక్షీ తేలి తప్పులు లేకుండా వ్రాస్తూయున్నావు. అట్లు వ్రాసినప్పుడు నీవు పరీక్ష ప్యాసు అయినట్లు భావింపబడి పై పరగతిలోకి పంపబడుచున్నావు. ఇలా అంచెలు అంచెలుగా నిచ్చెన మెట్లు ఎక్కినట్లుగా నీవు జ్ఞానవంతుడవై పరోపకార మంటే ఏమిటో, నీవు జీవిత కాలములో ఆచరించవలసిన విధులను అనుభవముమీద తెలుసుకుని ఆచరించుచున్నావు. నీవు తెలుసుకుని ఆచరించినకొలది నీకు జీవిత చక్రమునకు మధ్యయున్న ఇరుసు అరిగిపోయి, ఒకనాడు చక్రము ఇరుసునుండి విడిపడిపోవుచున్నది. అటులనే నీవు ధర్మ మార్గమున ప్రవర్తించిన కొలది నీకు ఈ జీవితమునకు సంబంధము సళ్ళిచ్చుచున్నది. సళ్ళిచ్చుట యంటే నీలో దాగియున్న 'బంధుప్రేమలు' నశించి 'నేను అంటేఏమిటో'

పిలుచుచున్నావో ఆ నామము మీ నీమనస్సున వ్రేళ్ళుపాతుకొను
చున్నది. ఇలా కాగా కాగా కొంతకాలమునకు నీవు ఈ రూప
వస్తువుల నిమిత్తమే లేకుండా ఆ దైవనామ చింతన లభిం
చును. అప్పుడు నీవు ఈ వస్తువులన్నియు నామరూపము
లని అసలు ఆ దైవము కూడా వస్తువులలో లేడని [illegible] ఉన్నను
నీవు పదార్థములయందు [illegible] యున్నట్లే యున్నాడని [illegible]
అభిప్రాయము కలిగి ఏ నామమున ఆ సర్వాంతర్యామిని
ప్రార్థించెదవు [illegible] నీ దృష్టిలో [illegible] సమస్త చరా
చర వస్తువుల యందును ఆ దైవము యున్నాడని భావించు
చుండినట్లు భావించెదవు. అట్లు సమస్త పదార్థములయందు
ప్రవేశించి యున్నది దైవమే అని గ్రహించి ఆ ఆత్మ సాక్షాత్కారం
యున్నదని [illegible] నీవు సర్వవ్యాపకత్వమును ఆచ
రించుచున్నావని [illegible] ఇట్లు గుర్తించుటే బ్రహ్మ
జ్ఞానమని మన పూర్వులు నామకరణము [illegible]. ఈ ఆత్మ
సదా నీలోను [illegible] సమస్త జీవరాసులలోను
యుండినప్పుడు నీకు భేదము లేకయుండుట ఆ స్వభావమని
భావించెదవు. అది [illegible] ఇది నీది యనిగాని, నేను, నీవు యని
గాని భేదము లేక ప్రవర్తించెదవు అంటే ఆ పరమాత్మను
సర్వజీవ జంతువులయందు చూచుచున్నావు. అంతేగాక
ఆ ఆత్మ ఒక శరీరమును వీడిపోవునప్పుడు గాలిలో మిళిత
మగుచున్నది, అది ఎట్లనగా నీవు పొగచుట్ట త్రాగినప్పుడు
నీవు పొగ పీల్చి పిమ్మట వదలుచున్నావు, అట్లువదలిన పొగ
గాలిలో మిళితమై రూపరహితమైనట్లుగా ఆత్మశరీరమునుండి
వీడి గాలిలో మిళిత మగుచున్నది. అందువల్ల గాలి బరు

వగుట లేదు గనుక ఆ ఆత్మ చాలా సూక్ష్మ పదార్థమని దానికి రూపురేఖలు లేక అవసరమైనప్పుడు నీలోను, నీవు చనిపోయినప్పుడు గాలిలోను తిరుగాడుచుండునని గ్రహించవలెను. ఇట్టి ఆత్మ మానవుని లోనే గాక పశు వృక్ష జీవ జంతువులలో కూడా యున్నదని గ్రహించవలెను. అది ఎట్లన మానవునివలెనే పశువులు చనిపోవుచున్నవి చెట్లు ఎండిపోయినశించుచున్నవి. మరిన్ని ఆత్మ అంటే మబ్బు వంటి పొగ పదార్థమే యని భావించకండి. నీని ఆధారముగా చేసుకొని మానవుడు మాట్లాడుచున్నాడు. ఇంకా ఇంకా అనేకపనులు చేస్తూ యున్నాడు. గనుకనే ఆత్మ సర్వాంతర్యామి యని పెద్దలు వచించి యున్నారు. ఈ ఆత్మ విచారణవల్ల మీలోని సందేహములు చాలావరకు సడలి పోయినట్లుగా భావించుచున్నాను. ఈ ఆత్మయే నీ శరీరములో యుండినప్పుడు నీకు అనేక భావములను, మంచివిగాని చెడ్డవిగాని కలుగజేయుచున్నాడు అంటే స్ఫురింపజేయుచున్నాడు. స్ఫురించినవెంటనే కొన్నిటిని ఇతర అవయవములతో ఆచరణలో పెట్టుచున్నావు. ఇదే ఆత్మాధర్మము.

(30-3-75.)

## పదమూడవ అధ్యాయము

జనులు వేలాదిమంది యాత్రలు సేవించుచున్నారు. అంటే వారి నివాస స్థానముగాక పర ప్రదేశములలో యున్న వింతలు, విశేషములు చూచుచూ ఆయా ప్రాంతములలో యున్న దేవాలయములను దర్శించుచు దానధర్మ

ములు చేయుచూ ఆ ప్రాంతములవారి ఆచారములు, దుస్తులు, భాష ఇత్యాదివి తెలుసుకుంటూ యాత్రలు చేసి తిరిగి వారి వారి స్వస్థానములకు వచ్చుచున్నారు. ఇందువల్ల ప్రకృతిసౌందర్యములనుచూచి ఆనందించుచున్నారు. అలాగు ననే ఆ ప్రాంతములవారు ఈ ప్రాంతములకు వచ్చిపోవు చున్నారు, అంటే ఒకరి ఆచరణావిధానములను మరి. ఒకరు తెలుసుకొనుచున్నారు గాని ఆయా ప్రాంతములలో నివ సించువారందరుకూడ ఒకే దైవముచే సృష్టింపబడినవారు. ఇందువల్ల వారి వారిలోగల బహిర్ భేదములను తెలుసు కొనుచున్నారు. కాని వారి శరీరములోయున్న జీవికూడా మన శరీరయంత్రములోని వంటిదేయని, ఈ యంత్రముల సృష్టికర్త ఎవరనిగాని, ఎందుకు ఇట్లు సృష్టించు చున్నాడని గాని విచారించుట లేదు. అట్లు ఎవరైనా ఒకరు విచారించిన యెడల వారిని పిచ్చివారిక్రింద ఎగతాళి చేయుచున్నారు. ఇది ప్రాపంచక ప్రజల లక్షణము. అట్లు విచారించువారు లేకపో లేదు. అట్టివారు విచారించి విచారించి ఈ ప్రాపంచిక విషయములన్ని మాయా స్వరూపములని భావించి, ఈ జగన్నాటకమునకు సూత్రధారి యెవరని పరిపరివిధముల తపించుచున్నారు. అట్లు తపించగా వారికి ఆత్మజ్ఞానము గలుగుచున్నది. వారే బ్రహ్మజ్ఞానులని పిలవబడుచున్నారు. అట్టివారికి ఈ ప్రాపంచిక వస్తువులయందు ఏమాత్రము కోరికయుండదు. అదియునుగాక వారికి ఆకలి దప్పికలు కూడా నామమాత్రముగా యుండును. అట్టివారు ఈ భూలోకములో సర్వప్రజలమధ్య తిరుగక ఏకాంతవాసము

నందు ఇచ్ఛగలిగి మరుగు ప్రదేశములలో యుండుచుందురు. వారికి ఆత్మజ్ఞానము సునాయాసముగా అబ్బినట్లు భావించ వలసియున్నది. (31-3-75.)

## పదునాల్గవ అధ్యాయము

రాబోవు సంవత్సరం అంటారు. ఇది ఎప్పటికి రాబోవునది. అనుకొనేటప్పటికి రాబోవునది. ఈ విధముగానే రాబోవునెల, తిథి, వారం వస్తూనే యుంటవి. పోతూనే యుంటవి. అంటే ప్రతిరోజు ఉదయం, మధ్యాహ్నం సాయం త్రం, రాత్రి వచ్చినట్లే వారం, నెల, సంవత్సరం ఇత్యాదివి జరిగిపోతూ వుంటవి. ఇదేవిధముగా ఎన్నోకోట్ల సంవత్సర ములనుండి వస్తూయున్నవి. వెళ్ళిపోతూ యున్నవి కాని ఈ సృష్టి స్వభావముకాని తినుట త్రాగుట, నిదురించుట, మేలు కొనుట యనునవి ప్రతిరోజూ జరుగుచున్న ఆచరణా కార్య క్రమమే. ఇది అంతయూ ఒకసృష్టికర్త ప్రభావమేయని ఆయన అడుగునచేరి ఇవి అన్నియు చేయుచున్నాడు. అంటే కుమ్మరి పురుగు భూమిలోచేరి భూమిని గుల్లచేయుచున్నది. నలికెలపాము మట్టిలో నివసించుచూ ఆ మట్టిలోనే తమ జీవితమంతయు ఆమట్టిని తొలచుచున్నది. ఉదాహరణకు చూడండి ఒకచిన్నపాము కనబడినను పెద్ద కర్రతోనే కొట్ట మంటారు. అలాగుననే ఒకచిన్న దోషము కనబడినను పెద్ద దోషము కనబడినను దోషనివారణ విధానము ఒకటియే, జీవజంతువులు వేలాదిరకములు మనము చూచుచున్నాము. వాటి పోషణకర్త వేరుగా యున్నాడని భావించండి. మన

ఇంట్లో ఒక మంచముపైన పడుకొని చూస్తే సూర్యుడు కనబడుతాడా? కనబడడు. బైటకువచ్చిచూస్తే కనబడుతాడు. అట్లనే బైటప్రపంచ విషయములను గురించి విచారించవలెను. (1-4-75)

## పదిహేడవ అధ్యాయం

గురువుల ఆదేశ ప్రకారము శిష్యులు ఆచరించుట ధర్మం. అట్టి గురువులు ఎల్లప్పుడు శిష్యులకు అవసర జ్ఞానమును కలుగచేయుటయే. ఆ శిష్యుల ప్రవర్తనా దోషములను దిద్దుచూ తమంతటివారినిగా చేయుట గురువు యొక్క ధర్మం. అందువల్లనే ప్రతిగురువు శిష్యులకు ఎంతవరకు జ్ఞానము లభించినది తెలుసుకొనుచుండును, పరీక్షల ద్వారా. అట్లానే నేటివరకు నేను చెప్పిన బోధలలోని సారాంశమును మీరును గ్రహించినారని తలుస్తాను. మరిన్ని ఒక జీవికి మరి ఒక జీవికిగల బాంధవ్య ప్రేమలు ఎట్లు కలుగుచున్నవి యనెడి సమస్యను గురించి నేడు చర్చిద్దాము.

ప్రతిమానవుడు నా భార్య నా బిడ్డలు అంటాడు. ఈ నా అనే పదము ఎక్కడనుండి వచ్చినది. ఇది శరీరము గుండా లేక శరీరములో దాగియున్న జీవిగుండా? అంటే జీవికి ఎట్టిసంబంధము లేదని చెప్పవలసి యున్నది. జీవి శరీరమును బాసి వెళ్ళగా, నీ నా బంధువులు అన్నవారు శోకించుచున్నారు. ఈ చనిపోయిన శరీరము భస్మమగుచున్నది. పిమ్మట ఈ జీవి బంధువులు వారివారి ప్రాపం

చిక ధర్మములలో యథాప్రకారము ప్రవర్తించుచున్నారు. ఈ చనిపోయిన జీవి గాలిలో కలసి పరలోకం చేరుచున్నది. ఈ పరలోకం చేరే జీవికి ఈలోకంలో యున్న బంధువులను గురించి ఎంతవరకు ఆలోచనయుంటుంది అంటే జీవి శరీరమును వీడగానే ఈ లోకములోని బంధుప్రేమలు యుండవు. మరిన్నీ దూరప్రయాణము చేసిన యాత్రికులకు ఇంటి విషయములు అంతగా బాధించవు. అటులనే చనిపోయిన జీవి తన భవిష్యత్తును గురించి ఆలోచిస్తుంది.గాని వదలి వచ్చిన బంధుకోటిని గురించిగాని, ధనధాన్యములు, ఆస్థిపాస్తులను గురించిగాని బాధపడదు. అది ఎట్లంటే నీవు ఒకరోజున వూరువిడచి పరాయి గ్రామము వెళ్ళినప్పుడు నీకు ఇంటిధ్యాన్నం ఉండక అచ్చటి కార్యక్రమముల యందే నీ మనస్సు లగ్నమై యుండును. గనుక ప్రతివారు నప్పుడు చనిపోగానే ఈ బాంధవ్య ప్రేమలు దిగజారినట్లు భావించవలెను. మరిన్నీ ఒకనాడు నీవు చేసిన భోజన పదార్థములను మరురోజు మరచుచున్నావు. అట్లే నీ బంధుకోటిని కూడా మరచుచున్నావని గ్రహించవలెను. 2-4-75

## పదహారవ అధ్యాయము

చంద్రగుప్తుడు పరిపాలన చేసిన కాలములో వారి ఆస్థాన పండిత సభలో ఆత్మ అంటే ఏమిటి? ఎలా ఉంటుంది? దాని రూపు రేఖలు ఏమిటి? భోజన క్రమము ఏమిటి అని చర్చింపబడినది. అందు సమావేశమైన మహా పండితులలో ఉద్దండుడు చక్రవర్తిగారి ఆప్త మిత్రుడు

అయిన ఆయన ఒకరు లేచి ఈవిషయం సమాధానము నకు పది రోజులు కాలం ఇవ్వమన్నారు. ఇంకొక ఆయన లేచి నేను ఇప్పుడే చెబుతాను గాని నేను చెప్పిన పిమ్మట ఎవరూ మాట్లాడ కూడదు. మాట్లాడదలచిన వారు నా కంటె ముందే వారి అభిప్రాయం చెప్పవచ్చును అన్నారు. అంతలో ఇంకొక ఆయన లేచి ఈరోజు మధ్యాహ్నం గం. 12-00 లకు తిరిగి సమావేశమవుదాము అప్పుడు నేను చెబుతాను అన్నారు. తలఒక విధముగా చెప్పినపిమ్మట ఒక బాల సన్యాసి లేచి అదుగో ఆత్మ చూడండి అన్నాడు. అందరు నవ్వినారు. ఎవరికీ ఏమీ కనబడ లేదు. అదే కన బడని పదార్థమే ఆత్మ అని మీరు ఈ సమాధానము అంగీకరిస్తే మిగతా ప్రశ్న భాగమునకు జవాబు చెబుతా నన్నాడు. అందరు ఆశ్చర్య పోయి సరే అన్నారు. కన బడని వస్తువుకు రూపురేఖలు లేవు అది అతి సూక్ష్మ మైన వస్తువు ఒక ఇసుక రేణువులో పది యవ భాగమంత యుంటుంది. దానిని నోటితో ఊదుతే పది మైళ్ల దూరము పోవును. అట్టి రూపురేఖలు లేని అతిసూక్ష్మ పదార్థమే ఆత్మయని గ్రహించండి అని చెప్పినారట. అట్టి ఆత్మను గురించి ఆనాటినుండి ఈనాటివరకు ఎన్నో వేలమంది తలలు బ్రద్దలు కొట్టుకొనినను కనబడని అర్థముకాని పదార్థ మును గురించి నాకు తోచినంతవరకు 16 రోజులనుండి చెప్పి నాను, రేపటినుండి బలిచక్రవర్తిగారు చెబుతారు నాకు శెలవా ? విక్రమార్కులవారు. 3-4-75

---

# బలిచక్రవర్తివారు

## ఒకటవ అధ్యాయము

నేడు మహాసుదినం. ఎందువల్లనంటే భూలోకములో యున్న మీరు పరలోకములోయున్న నేను శ్రీ ఋషి రాం రాం గారి ప్రోత్సాహమువల్ల పరిచయులమై ఆత్మ అంటే ఏమిటి? అనే విషయమునుగురించి నా అనుభవమును మీ పరంగా భూలోకవాసులకు తెలియజెప్పకోనున్నాను.

నేను ఒక గొప్ప మేధావినిగాదు. వేదశాస్త్ర పండితుడనుకాను. సృష్టిక్రమమునుగురించి పెద్ద అనుభవము లేకపోయినప్పటికి మిత్రుల ప్రోత్సాహమువల్ల ఈ చర్చను అంగీకరించినాను. నేటినుండి 21 రోజులు ప్రతిరోజు ఇదే కాలమున ఒక్కొక్క అధ్యాయము చెప్పదను, వాటిలో తప్పలుండవచ్చును. పెద్దల అభిప్రాయములకు కొంత విరుద్ధముగా యుండవచ్చును. అందువల్ల మీరు సందేహించవలసిన పని లేదు. ఎందువల్లనంటే ఈ సమస్యనుగురించి వేలాది సంవత్సరములుగా వేలాది పండితులు వారివారి అభిప్రాయములు వేరువేరుగా చెప్పియున్నారు. గనుక ఒక నిర్ణయమునకు వచ్చుటకు వీలులేదు. గజమునకు మూర్ఖ అరు అంగుళములు ఎవరుచెప్పినను, ఇది అట్లుకాదు. ఒక అగోచర పదార్థమునుగురించి ఊహించి చెప్ప విషయం గనుక

మనిషి మనిషికి అభిప్రాయ భేదము లుండవచ్చును. ఒక గ్రామమునకు వెళ్ళవలెనంటే రెండు మూడు మార్గములే యుండును. 1) రైలు మార్గము, 2) కాలి బాట మార్గము, 3) కాలువ పడవ మార్గము, 4) విమాన మార్గము, ఇది అట్లు కాదు. అనేక మార్గములు వేలాది యున్నవి. ఎవరికి తోచిన మార్గము వారికి ధర్మమార్గము అంటారు. సర్వమార్గములు సముద్రములోనికి చేరినట్లుగా ఈమార్గములన్నియు ఈ భూలోకములో నుండి పరలోకములోనికి యున్నవని గ్రహించండి. అంతేగాని నాకు తెలిసిన మార్గము ఒకటే యని మిగతావి లేవని వాదించ వద్దు. కథా రంగము లోనికి ఇక మనము దిగుదాము.

మానవుడు భూలోకములో యున్నాడు. ఆ మానవుడు బాల్యములో ఆటలు ఆడుకొనుచూ తల్లి దండ్రుల పోషణలో యున్నాడు. కొంత కాలమునకు యవ్వన వంతుడై వివాహమాడి గృహస్థుడై సంతాన వంతుడై కుటుంబ భారమును వహించి కుటుంబ రక్షణకై ఆర్జన చేయుచున్నాడు. ఇట్లు చేయుచుండగా బిడ్డలు తమంతటివారు అగుచున్నారు. తాను వృద్ధాప్యమునుపొంది సంసార బంధమునుండి క్రమేపి విడిపోవుచున్నాడు. అట్లు విడిపోవుటయే కాదు. తాను వచ్చిన దారిని తిర్గి వెళ్ళుచున్నాడు. ఇది అంతయు ప్రపంచ జీవిత క్రమము. యీ విధానములో ప్రతి విషయము గురించి వివరించి ప్రతిరోజు చెబుతాను. యీ రోజుకు శెలవు! 4-4-75.

## రెండవ అధ్యాయము

ఈ నాడు నేను చెప్పు వ్యాసము ముఖ్యముగా ఆత్మ యనునది శరీరములో ఏ భాగములో యుండును? ఉండి నట్లు గుర్తు ఏమిటి అను విషయం.

ప్రతి జీవికి శరీరమనేది ఒకటి ఉంటుంది. అది పెద్దది కాని చిన్నది కాని. చీమ శరీరము సూది బెజ్జమంత యుండును. అయినప్పటికి దానిలోనే సర్వ అవయవములు ఇమిడియుండును. ముక్కు, నోరు, చెవులు, పొట్ట ఇత్యాదివి. వాటిలో ముఖ్యముగా పొట్ట భాగములో తిన్న పదార్థములు అరిగి జీర్ణించి రక్తముగా మారి శరీరమంతయు ప్రవహించుచూ శరీరమునకు కావలసిన శక్తి నిచ్చుచున్నది. ఆ పొట్టలో పై పనులన్నియు చేయుటకు గాను ఒక యంత్రము వంటి పదార్థము యున్నది. ఆ యంత్రమునకు, గాలి, నీరు ఇత్యాది వాటివల్ల నడుపబడి భుజించిన పదార్థములు చూర్ణమై సారమును పిండబడి పిప్పి పదార్థము మలము రూపముగా బైటకుపోవు చున్నది. ఈ యంత్రమునకు ముఖ్య సహాయ వస్తువు ఏమంటే జీవి.

ఆ జీవి ఉండినంత సేపే ఈగాలి, నీరు సహాయముతో యంత్రము పనిచేయును. యంత్రము పనిచేయ లేదంటే ఏదో పదార్థము కొదువ అయినదని గ్రహించవలెను. అన్ని పదార్థములు లభించుచున్నను ఒక్కొక సమయమున, ఆ జీవి పనిచేయదు. అంటే ఇంజనులో బొగ్గు, నీరు ఉండినను వాటిని వెలిగించి, ఆవిరిని ఉత్పత్తి చేసినప్పుడు ఆ ఆవిరి

సహాయముతో సర్వ అవయవములు పనిచేయును. ఆ ఆవిరి పేరే ఆత్మ. అట్టి ఆత్మ ప్రతినిమిషము ఉత్పత్తియగుచూ యంత్రమును నడిపించుచున్నది. వెచ్చపడ్డ ఆవిరి ముక్కులు, చెవులుగుండా పోవుచుండును. అలా పోనియెడల శరీరము వేడెక్కి జ్వరం వస్తుంది. గనుక ప్రతినిమిషము శరీర యంత్రములో ఉత్పత్తి అయిన వేడి ఆవిరి బైటకుపోవలెను. ఆవిరి ఉత్పత్తి అగుటకు నోటిగుండాను, శరీరములోని ప్రతి రోమకూపములోనుండి చల్లటిగాలి శరీరములోనికి ప్రవేశించవలెను. అలా చల్లగాలి ప్రవేసించనియెడల లోపల యంత్రము వేడిచే జామ్ అగును. అంటే ఇగిరిపోవును. అట్లు ప్రతిక్షణము ప్రతి జీవిలోను యంత్రము పనిచేయుచున్నప్పుడే ఆ జీవి బ్రతికే యుండినట్లు భావింపబడును. ఏ కారణము చేతనైనను ఈ కార్యక్రమమునకు ఆటంకము సంభవించినప్పుడు ఆ జీవి చనిపోయినట్లు భావింపబడుచున్నది. అట్లు చనిపోయిన జీవి శరీరములో నిల్వయున్న పదార్థములన్నియూ కుళ్ళి కంపుకొట్టును. అందుకే ఆ జీవికి దహనకర్మలు ఆచరింపబడు చున్నవి. ఇది నా నేటి సందేశము. 5-4-75

## షష్ఠమ అధ్యాయము

పలువురు మనుష్యులు ఒక మార్గమున వెళ్ళుచూ, మార్గము తెలిసినవారు ముందు నడచుచుండ మిగతావారు వారి వెనుక వెళ్ళుట సహజమేగదా! అటులనే ప్రతి మానవుడు ఏదోరోజున చనిపోయి, క్రిందటిరోజు చని

పోయిన వారు వెళ్లు మార్గమున తీసుకుపోకుండా వెళ్ళుచున్నారు. ఆ మార్గము రైలుమార్గము, బండిమార్గము కాదు. గాలిలో గాలిపటంగి సుడిగాలి వేసినప్పుడు ఏవిధముగా గల్లింతాలు కొట్టుచూ వెళ్ళునో ఆదేవిధముగా ఈచనిపోయిన జీవి వెళ్ళుచున్నది. అది అలా వెళ్ళగా వెళ్ళగా కొంతకాలమునకు పరలోకము చేరుచున్నది. ఆ పరలోకంలో చేరిన పిమ్మట తనముందే ఇదివరకు అక్కడకు చేరిన వారితో కలసి ముచ్చటించుకొనుచున్నది. వారి వారి అనుభవములను ముచ్చటించుకొనుచున్నారు. ఈవిధముగా కొంతకాలమైన పిమ్మట ఉభయులు [illegible] ఎవరి దారిని వారు పైలోకమునందు యున్న అధికారులను కలుసుకొనెదరు. వారు వీరి పూర్తి చిరునామాలను [illegible] ప్రభువులవద్ద పెట్టి వారి అనుమతి ప్రకారం [illegible] కొలువు తీర్చియున్న వారి చెంతనొక గదిలోకి [illegible] తీసుకు వెళ్లుదురు. అచ్చటికి వెళ్ళగానే భూలోకములో [illegible] చేసిన నేరములకు తగు మర్యాద [illegible] ఉదాహరణకు చూడండి. ఒక ఆవును దూడకు పాలు ఇవ్వకుండా ఉంచినట్లుగా ఈ [illegible] దూరములో ఒక గుంజకు కట్టివేసి బాధించుచుందురు. [illegible] చేసిన దోషములు నోటిగుండా చెప్పించెదరు. వాటి వివరములు తెలుసుకున్న పిమ్మట అచ్చటి అధికారులు ఆ చేసిన దోషములకు అవసరశిక్షలు ప్రకటించెదరు. అందులో కొందరు నిత్యమూ తమరు ఎవరికి అపకారము చేసినో వారికి అపకారమువల్ల ప్రాప్తించిన దోష ఫలితమును

ప్రకటించెదరు. వారు అట్లు ప్రకటించగానే అచ్చట ఉన్నవారు ఆశిక్షలు పొందు ఏర్పాట్లు చేయుదురు. ఇది దండనా విధానము. 6-4-75.

## నాలుగవ అధ్యాయము

పరలోకం అంటే ఏమిటి? ఎక్కడఉన్నది. భూలోకం గాక ఇంకా ఎన్నిలోకాలు ఉన్నవి. పరలోకం అని పిలువ బడేది యమలోకమూ లేక స్వర్గలోకమూ ఇత్యాది విషయ ములను గురించి ఈరోజు చెబుతాను.

అసలు లోకాలు ఎన్ని అంటే భూలోకము భువర్ లోకము అని రెండులోకములు. ఇవియునుగాక మనకు కన బడే నక్షత్రములు, సూర్యచంద్రులుకూడా వేరు వేరులోక ములనుండి కనబడే వెలుగు అని నాయొక్క అభిప్రాయం. అది అట్లుండగా మనశాస్త్రములలో పాతాళలోకమని మరి ఒకటి ఉన్నట్లుగా గ్రంధములు చెప్పుచున్నవి. ఇది అం తయూ ఒక మహాశక్తి ప్రభావమని గ్రహించండి. ఈ భూ లోకమునకు పైన అంటే ఆకాశమున వెళ్ళగా వెళ్ళగా ప్రాప్తించునది పరలోకం. ఈ పరశబ్దమునకు అర్థము మనము నివసించునదిగాక వేరుది అని భావించండి. ఉదాహ రణకు చూడండి మనగ్రామమునుంచి పరాయి గ్రామమునకు వెళ్లుచున్నామంటే మనము నివసించు ప్రదేశముకాని అన్య ప్రాంతమని గ్రహించినట్లుగానే పరలోకం అంటే మనం, తిరుగాడుచున్న లోకము గాక ఎక్కడనో దూరముగా యున్న లోకమని భావన కలుగుచున్నది. అది నిజమే. ఆ

పరలోకమునకు వెళ్ళుటకు ఈ రైళ్లు, బళ్లు, విమానములు పనిచేయవు. ఈ శరీరముతో వెళ్ళలేము. ఈ శరీరమును వీడి ఈశరీరములోయున్న జీవి అనే సూక్ష్మపదార్థము అతి తేలికది యగుటచే సుడిగాలి వచ్చినప్పుడు మన ప్రాంతము గాని ధూళిపైకి ఎగిరినట్లుగా చెట్టుకొమ్మలకు యుండిన పండు పండగానే చెట్టును తనంతటతాను వీడి భూమిమీద పడినట్లుగా, జీవి శరీరమును వీడగానే గగనమార్గమున గాలి పటంగి ఎగిరినట్లుగా పైకి వెళ్ళిపోవును. అది అతిసూక్ష్మ పదార్థమగుటచే మనకంటికిగాని Microscope కు గాని మరి ఏవిధముగాను మనము చూడలేము కాని వెళ్ళునని పెద్దల నాటినుండి బోధింపబడు చున్నందున అనాదిగా [illegible] వారి అభిప్రాయమును మనము అంగీకరించుచున్నాము. ఇది కాదని ఏ మతస్థులు అన్య విధమును ప్రకటించి యుండ లేదు. ఈజీవి ఎందుకు ఈశరీరమును వీడు చున్నది? మరి ఎందుకు పరలోకం వెళ్ళుచున్నది అనే విషయం గురించి రేపు చర్చిద్దాము.

7-4-75

## ఐదవ అధ్యాయము

భూలోకములో నివసించు సర్వజీవులు మరల మరల పరలోకమునకు పోవుచూ భూలోకమునకు వచ్చుచుందు వంటే ఒక చొక్కా మాయగానే ఉతుకుటకు చాకలికి వేసి మరి ఒక చొక్కా ధరించుచున్నాము. అటులనే సర్వ జీవులకు భూలోకములో కొంత కాల ముగుడు సరికి ఆజీవి ఆశ్రయించిన శరీరమునకు వృద్ధాప్యమువచ్చి ఏ పనిపాటలు

చేయుటకు అశక్తులగుచున్నవి. అట్టి అశక్తులైన శరీరమును వీడి పరలోకమునకు వెళ్లునని తాత్పర్యము. అట్లు వెళ్లి నప్పుడు ఈవిడిచిన శరీరము మురికి పట్టి కంపు కొట్టకుండా తినిపారవేసిన విస్తరాకు వలె భూమిలో పాతివేయుటో, దహనము చేయుటో మరి ఇతర విధముగానో దానికి తుది చర్యలు జరుపుచున్నాము. భోజనము చేయక ముందు అదే విస్తరాకును శుభ్రపరచి ఎంతో పొదుపుగా దాచు కున్నాము. అందులో మనము భోజనము చేసినంతసేపు దానికి ఏదోషం లేదు. మన భోజనం పూర్తికాగానే ఆ విస్తరను ఒక అశుచి పదార్థముగా భావించి వీధిలో పార వేయుచున్నాము. ఆ విస్తరను వీధిలో కుక్కలు పట్టుకుని దానిలోని మిగులు పదార్థములను భుజించుచూ ఆవిస్తరి కొరకు కుక్కలు పోట్లాడు కొనినట్లుగా స్మశానములో పాతి వేయబడిన శరీరములోని కండలు కుక్కలు పగలు, రాత్రిళ్లు నక్కలు తినుచూ రూపు రేఖలు నశించి శల్యములు విడిపడు వరకు అవి వెంటపడి ఆనందించుచూ అనుభవించుచున్నవి. ఇదే శరీరము జీవముతో యుండి నప్పుడు నా భార్య నా భర్త యని అనురాగ ప్రేమలతో కవుగలింతలు చేసుకొనుచూ ఆనందించుచున్నాము. ఇది ఒక మానవుని స్వభావమే కాదు. ప్రతి జీవజంతువుకూడ ఆచరించుచున్న విధానము, ఇది ఇట్లుండ ఈ దేహమునకు అనేక విధములైన లేపనములను రుద్ది శుద్ధిపరచి ఆనం దించుచున్నాము. ఇది అంతయు ఈ జగత్తులోని ఒక రంగము. ఇట్లు కొలదికాలము ఆనందించి, ఆనందించి మృతి

చెందుచున్న ఈ జీవి వెడలిపోగానే ఆకళేబరము బరువెక్కు
చున్నది కొయ్యబారుచున్నది. అంటే గర్భములోయున్న
యంత్రము పనిచేయుట లేదన్నమాట. ఆ యంత్రమునకు
ముఖ్యసాధన వస్తువులైన జీవి శరీరమును బాయుటయే
ముఖ్యకారణము. ఇదియునుగాక ఆజీవి చనిపోయిన శరీరము
లోనుంచి ఏమార్గమున ఏరూపములో బైటకు వెళ్లుచున్నది
యనగా ఒక చిన్న తుమ్ము తుమ్మినప్పుడు మన శరీరమునకు
ఒక కదలికకలిగి ముక్కువెంట తుమ్ము వచ్చును. ఆ
తుమ్మునకు రూపము కలదాయంటే లేదు. తుమ్మువచ్చినట్లు
బైట గాలిలోకి వెళ్లినట్లు మనము ధ్వనివల్ల గమనించు
చున్నాము. అదే తుమ్ము ఒకప్పుడు ధ్వనిచేయును. లేక
కొద్ది ధ్వనిచేయును. కాని ఈజీవి వెళ్ళునప్పుడు ఎట్టిధ్వని
చేయదు. అది శరీరములోని నవద్వారములలో ఏద్వారము
గుండా సునాయాసముగా బైటకువెళ్ళుటకు అనుకూలముగా
యుండునో ఆ మార్గముగుండా పోవుచున్నది. ఇట్లు జీవి
శరీరమును బాయగానే అది ఎక్కడికి పోవలెను అను
తలంపుతో ఆ ప్రాంతములనే కొంతకాలము తిరుగాడు
చుండును. ఆకాలమును వేరువేరు మతస్థులు వేరువేరుగా
నిర్ణయించినారు. మరిన్ని జీవితకాలములో ఆజీవికి పోషక
వస్తువులు కలుగచేసినట్లుగా ఆచనిపోయిన ప్రదేశములో
వారివారి మతధర్మప్రకారం పోషక వస్తువులను సమర్పించు
చున్నారు. దీనినే కర్మకాండలు జరుపుచున్నారని మనము
చెప్పుకొనుచున్నాము. ఇట్లు కర్మకాండలు జరుపుటవల్ల

వీరి భావన ప్రకారము ఆజీవికి చెందుచున్నవా లేదా యనెడి సమస్యను గురించి రేపటి రోజున చర్చిద్దాము.

(8-4-75)

## ఆరవ అధ్యాయము

చిన్నతనములో ఆటపాటలతోను వయస్సులో భార్యా బిడ్డలతోను జీవితమును గడుపుచూ వృద్ధాప్యము రాగానే బిడ్డల సహకారముతో జీవయాత్ర చేయుచూ జీవితమును గడుపుచున్నాము. అంతేగాని దైవచింతన ఇసుమంతయు లేదు. అట్లు జీవయాత్రగడిపి ఏనాడో ఒకనాడు చనిపోవు చున్నాము. కాని ఈ పుట్టుట చచ్చుట అంటే ఏమిటి? ఈ పెరుగుట ముసలితనము ఎందువల్ల కలుగుచున్నవి. అవి మనము సాధారణముగా విచారించుటలేదు. ఇది స్వాభావిక మని అంటామే గాని దీని మర్మమును గురించి తెలుసుకుందా మనే భ్రమ కలుగుటలేదు. అందువల్ల అజ్ఞానుల మగు చున్నాము. దీనిని శోధించవలెననెడి తలంపు మాత్రము కోటికి ఒకరికి కలుగుచున్నది. కాని దానిని శోధించుటకు వారి జీవితకాలము చాలుటలేదు. ఇట్టి సమస్యను గురించి అనాదినుండి నేటివరకు శోధించినవారు ఏమంటున్నారంటే ఈలోకము పరలోకము అని రెండు వున్నవి. జీవితానననంత రం ఈ శరీరములో దాగియున్న జీవి అనే సూక్ష్మపదార్థము ఈ ప్రపంచమునుండి గాలిలో ఎగురుచూ దుమారమువలె పైలోకములోనికి ఎగురుచూ పోవుచున్నది అంటారు. అక్కడ ఈజీవి కొంతకాలముండిన పిమ్మట తిర్గి ఈభూలోక

మునకే వచ్చునని, వచ్చునపుడు ఏరూపములో ఏప్రాంత నకు వచ్చునో మనము చెప్పలేమని అంటారు

ఈ వెళ్లిన జీవి వెళ్లేటప్పుడు గాని తిర్గి వచ్చేటప్పుడు గాని పూర్వజన్మ సువాసన యుండక తాజాగా యున్న మనస్సులో యుండునని పెద్దలు చెప్పుచున్నారు. ఇది వాస్తవమే. ఎందువల్ల నంటే ఆ పూర్వ జన్మలోని బంధు ప్రేమలు ఇత్యాదివి నశించని యెడల పూర్వ జన్మయందు ఆపేక్ష నశించదు. అదియునుగాక మనము నిన్న మొన్న కూర ఈరోజున మరచుచున్నాముగదా! గనుక వెనుకటి విషయములు గుర్తు యుండవు జాలవు. ఇదియునుగాక ఒక రోజున మనము నిదురపోయి నాముంటే ఆ నిదురలో అనేక కలలు పొందుచున్నాము. నిదుర లేవగానే ఆ విషయములు నిజము కాదని కలయని భావిస్తూ యున్నాము. అటులనే ఈ శరీరము వీడిన జీవి గత జీవిత విషయములన్నియు ఒక కల యని భావించి మరచుచున్నది. ఇదే సిద్ధముగా మంచి గాని చెడ్డ విషయముగాని తెలుపు నుండ జాలవు. మానవుడు శరీరమును తనది యని గుర్తించును. కాని తను శరీరమని భావించడు అందువల్లనే నా శరీరము అనుచున్నాడు. అట్టి శరీరమును వీడగానే పాము కూసమును వీడినట్లుగా భావించుచున్నాడు, శరీరమును వీడి నందువల్ల హాని లేదు. పాము కూసమును వీడినందువల్ల పామునకు దోషము లేనట్లు, జీవి వేరు. గనుక శరీరము, జీవి వేరువస్తువులని అర్థమగు చున్నది. ఆ జీవి పరలోకమునకు వెళ్లినప్పుడు తను గత శరీరములో చేసిన లేక

అనుభవించిన సర్వ కర్మల యొక్క గుణా గణములను తను చేసినట్లుగా భావించకు తన సహాకారముతో తను ధరించిన శరీరము చేసినట్లు భావింపబడుచున్నది. అందు వల్లనే భూలోకములోని శిక్షలన్నియు ఆశరీరమే అనుభవించవలసి యున్నది. కాని సాక్షి రూపముగా యున్న ఆ జీవి కాదు. అందువల్ల ఆజీవి జీవిత కాలములో చేసిన పుణ్యా పాపముల ఫలితమును తిర్గి ఆ శరీరమే అనుభవించవలెను గాని జీవి కాదు. గనుక వేరు శరీరములో తిర్గి భూలోకములోకి వచ్చి ఆచేసిన పుణ్యాపాపముల ఫలితములను అనుభవించుచున్నారు. అంతేగాని జీవి సాక్షీ భూతము మాత్రమే యని గ్రహించండి. 9-4-75.

## ఏడవ అధ్యాయము

ఈనాడు మనము చర్చించబోవువిషయం ముఖ్యముగా ఆత్మఅంటే ఏమిటి? జీవిఅంటే ఏమిటి? వీటి రెండింటికి గల భేదము ఏమిటి? అలా భేదము లేనియెడల ఆత్మనే జీవియని, జీవినే ఆత్మ అని పిలువబడుచున్నదా? ఈలోకంలో ఎన్ని ఆత్మలు ఉన్నవి? ఈ ఆత్మలు ఒకదానిని మరిఒకటి, గుర్తించగలదా? వారి ఉభయులలో భావములను ఎట్లు ఎరుకపరచుకొనగలవు. ఇత్యాది విషయములు.

ముఖ్యముగా ఆత్మఅంటే ఏమిటి అని ప్రథమమున విచారిద్దాము. ఆత్మఅంటే ఒక వెలుగు. ఒక గదిలో చీకటి యున్నది. ఆ గదిలోదీపం వెలిగిస్తే చీకటిపోయి వెలుగు

వస్తూయున్నది. ఇది మనకు ప్రతి దినము కనబడు దృష్టాంతము. ఆ చీకటి ఏరూపములోయున్నదంటే చెప్పగలవా? చెప్పలేము. మన కంటిదృష్టికి ఏమీ కనబడకపోవడమే చీకటి అంటారు. అది కంటిదోషమా? పిల్లికి చీకటిలో సమస్తము కనబడునని అంటారు. ఆలాగే కొన్ని జీవజంతువులు చీకట్లో సంచరిస్తవి, మనము సంచరించలేము, దీపము వెలిగించగానే ఆ చీకటి ప్రదేశమంతయూ మన కంటికి కనబడుచున్నది. మనము అప్పుడు ఆప్రాంతములోని సమస్త వస్తువులను గుర్తించగలము. ఇది కంటిలోని దోషమా అంటే కాదు. ఎందువల్లనంటే సూర్యుడు ప్రకాశించినప్పుడు వెలుతురు అన్నిచోట్ల యుండును. సూర్యుడు అస్తమించగానే చీకటి కలుగుచున్నది. ఆచీకటి ఎక్కడనుండీరాలేదు. ఎందువల్ల మనము ముఖ్యముగా గ్రహించవలసినది ఏమనగా చీకటిగాని వెలుతురుగాని నూతన పదార్థములుకావు. ప్రతి రోజు ప్రాప్తించునవే. వానికి రూపురేఖలు ఏమిటంటే మనము ఏమిచెప్పగలము. అటులనే ఈ ఆత్మఅనే పదార్థము సర్వప్రదేశములలోను వెలుతురు చీకటివలెనే యుండును. ఈ ఆత్మ ఎక్కడో దాగిలేదు.

జీవుడు అంటే ప్రతి శరీరమును నడిపించుచున్న యంత్రమునకు ముఖ్యశక్తి. ఆయంత్రము పనిచేసినప్పుడు ఆశరీరముయొక్క అవయవములు కదలాడుచూ వాటివాటి ధర్మములను చేయుచుండును. అట్లుచేయక స్తంభించినప్పుడు శరీరములో జీవుడు లేడని భావిస్తాము. ఆజీవుడు ఏమైనాడు? ఎక్కడకు పోయినాడంటే దీపములో చమురు

యున్నంతసేపే దీపము వెలుగును. చమురు అయిపోయిన, వత్తి అయిపోయినా, లేక గాలి తగిలినా దీపము ఆరిపోవుట మనము చూచుచున్నాము. అలాగుననే ఈశరీరములోని యంత్రములో మురికిపట్టి యంత్రముయొక్క పళ్లు సులువుగా నడుచుటకు అడ్డు తగిలినప్పుడు యంత్రము కదల మెదలలేక చిక్కు పడినప్పుడు ఆ యంత్రము పనిచేయక ఆగిపోవును. ఆగిపోవుటే జీవుడు శరీరములో లేడని భావిస్తూ యున్నాము. ఆజీవుడు ఎక్కడనుండి వచ్చినాడు. ఎక్కడకు వెళ్ళినా డంటే ఏమని చెప్పాలి? ఆయంత్రమునుండి ఏమీ బైటకు పోలేదు. రాలేదు అంటూనూ? శరీరములోకి బైటగాలి పీల్చబడుటగాని లోపలిగాలి బైటకు వదలబడుటగాని లేక స్తంభించినది. ఇట్టి పరిస్థితిలో మనమంతా ఆశరీరములోని జీవి చనిపోయినదని మనం అంటున్నాము. ఇకను ఆత్మకు జీవికి సంబంధము ఏమిటి అంటే యంత్రము పనిచేయ నప్పుడు శరీరము స్తంభించినప్పుడు శరీరములో నుండి ఒక విధమైన పొగవంటిది బైటకు వచ్చి గాలిలో కలసిపోవు చున్నది అది జీవి అంటారు.

ఆజీవికి రెక్కలు ఇత్యాదివి లేవు, గాలిలో చేరగానే దానికి ఒక విధమైనశక్తి కలుగుచున్నది. అది ఎట్లనగా పొయ్యిమీద గిన్నెలో నీళ్లుపోసి పెట్టుచున్నాము, పొయ్యి మండగానే గిన్నె వేడెక్కి గిన్నెలోని నీటిలోనుండి ఆవిరి వంటి పదార్థము బైటకు పోవుచున్నది. నీళ్లు చల్లార్చుటకు గాను మనము పొయ్యి ఆర్పుచున్నాము. అప్పుడు క్రమేపి నీళ్లు చల్లారుచున్నవి అంటే దానికి చలిగాలి తగులగానే

దానిలోని వేడి నశించుచున్నది. ఇది ఇట్లుండగా అందులో నుంచి బైటకు వెళ్ళిన వెచ్చని ఆవిరిపదార్థము గాలిలో మిళితమై అగోచరమగుచున్నది. అంటే అది గాలితో కలసి ఆకాశమునకు పై భాగమునకు వెళ్లుచున్నదన్నమాట అట్లు పోవునప్పుడు జీవి పరలోకమునకు ప్రయాణము చేయుచున్నదని భావించుచున్నాము. ఈజీవి గాలిలో మిళితము కాగానే దానిబరువు తగ్గుచున్నది. అప్పుడు అతిసూక్ష్మరూపములో ఆకాశమార్గమున సంచరించుచున్నది. సంచరింపచేయు శక్తినే మనము ఆత్మఅనిపిలచుచున్నాము. కొందరు పెద్దలు వేరు వేరుగా వర్ణించుచున్నారు. మరికొందరు ఆత్మయే జీవియని జీవియే ఆత్మఅని చెప్పుకొనుచున్నారు. నిజము మాట్లాడవలెనంటే జీవివేరు, జీవికి శక్తిని కలుగచేయునది ఆత్మ అని భావించవలసియున్నది. ఇది ఇట్లుండగా పరలోకములో ఈజీవి సాక్ష్యమిచ్చువానివలె తనశరీరము చేసిన ప్రవర్తనలను ఎరుకపరచునుగాని శిక్షలుగాని ఫలితములుగాని అనుభవించునది రాబోవు జన్మలోని శరీరమేయని భావించండి. పరలోకములో యమయాతనలుగాని రంభాసంభోగములుగాని యున్నవని భావించుట గర్భములోని శిశువు పురుషుడని లేక స్త్రీయని చెప్పువిధమై యున్నదని గ్రహించవలెను. రేపు తిరిగికలుద్దాము. 10-4-75

## ఎనిమిదవ అధ్యాయము

పరపురుషులు, పరలోకము, పరస్త్రీ అంటారు. ఈ పరశబ్దముయొక్క ఉద్దేశ్యమేమనగా తనది కానిది యని

భావించవలసి యున్నది. ఇటులనే పరలోకమంటే మనకు దూరమున యున్న అన్యప్రదేశమని తలంచవలెను. ఈ లోకములో మానవులు, జీవజంతువులు. వృక్షములు, నదులు, పర్వతములూ యుండునట్లుగా పరలోకములో ఏమిఉంటవి అని తెలుసుకుందాము. ఆ పరలోకములో ఒక విశాలమైన ప్రదేశములో ఈ భూప్రపంచమునుండి వెళ్ళిన జీవులు ఉంటవి. వాటికి గాలి వెలుతురు మాత్రమే యుండును. అదియునుగాక దైవ సంబంధమైన విషయములు ఉంటవి. అంటే ఒక చిన్నగుడిలో పెద్ద వెలుగు యుండును. ఆ వెలుగు టార్చిలైటువలె సూర్యునివలె దేదీప్యమానముగా ఆప్రాంతమంతయు వెలుతురు నిచ్చుచుండును. అంతేగాని ఎండాకాలములోని ఎండవలెగాని, చలికాలములోని శీతలమువలెగాని యుండదు. ఆ వెలుతురులో పరలోకమునకు చేరినవారిలో కొందరు పెద్దలు యుంటారు. వారిపని ఒకొక జీవిని ఆజ్యోతికి ఎరుకపరుస్తారు. ఆజ్యోతిలోంచి ఒక విధమైన భావము అచ్చటనున్న పెద్దలకు లభిస్తుంది. అది ఎట్లానంటే వారి భావనకు టక్కిని గడియారం గంటకొట్టి నట్లుగా స్ఫ్రుహ కలుగుతుంది. ఆ భావన ప్రకారం తిరిగి ఏరూపంలో జననమొందవలసినది ఏఏ బాధలు కాని సుఖములుగాని అనుభవించవలసినది స్ఫ్రుహించును. అదే దైవ ఆజ్ఞగా భావింపబడి ఆజీవి ఆ ప్రాంతమునుంచి కొంతకాలమునకు తిరిగి భూలోకమునకు పంపబడును. అదియునుగాక జీవితకాలములో సగమునకు

మించి పరోపకారమునకే సేవచేసిన జీవులను అక్కడనే యుండుటకు ఆజ్ఞ ఇవ్వబడును.

అనగా అక్కడి పెద్దల బుద్ధికి తోచును అదే ఆజ్ఞగా భావించుదురు. అలా కొన్ని వేల సంవత్సరముల నుండి యున్న వారున్నారు. అలా ఉంటూ ఉంటూ కొంత కాలమునకు ఆ జ్యోతిలో ఐక్యమయి పోదురు అనగా సూదంటు రాయి ఇనుప సూదిని ఆకర్షించినట్లుగా ఈజీవిని ఆ జ్యోతి ఆకర్షించును. ఇది పరలోకములోని సత్య కార్య క్రమము. ఆ జ్యోతి సర్వకాల సర్వావస్థల యందూ దేదీప్య మానముగా యుండును. దానినే దైవమంటారు. ఇది నేటి ప్రసంగం. (11-4-75)

## తొమ్మిదవ అధ్యాయము

కొందరు పండితులు ఏమి చెబుతున్నారంటే పర లోకములో యున్న దైవము చనిపోయిన వారిని అక్కడనే దండించి పిమ్మట బుద్ధి చెప్పి మళ్ళీ ఇట్టితప్పులు చేయవద్దని బుద్ధి తెచ్చుకున్నావా యని అడిగి వారికి పరిపూర్ణ జ్ఞానము కలిగిన తర్వాత భూలోకమునకు పంపుచున్నారని కాని భూలోక వాసన తగలగానే వారి వాగ్దానములు మరచి తిర్గి తప్పులు చేయుచున్నారని చెప్పుటయేగాక ఫలాని తప్పు చేసిన వారికి ఫలాని విధముగా శిక్షించుచున్నారని చెప్పు టయేగాక అట్లు శిక్షించుచున్నట్లు బొమ్మలనువేసి మనకు చూపించుచున్నారు. ఇది అంతయు మనకు తప్పులుచేయ

ఉండుటకుగాను భీతితో ప్రవర్తించుటకుగాను సృష్టింపబడిన విధానములే యని నమ్మండి. దోషములు చేయుటగాని వాటి ఫలితములను అనుభవించుట గాని భూలోకమందే యని భావించండి ఇదియునుగాక ఉదహారణకు చూడండి. విశ్వాసముతో ప్రవర్తించిన ఒక శునకము మరు జన్మలో మానవుడై ఆ యజమాని వద్ద కాని మరి ఒక చోటగాని విశ్వాసముగల సేవకుడుగా జన్మించుచున్నాడు. ఇదే విధముగా ప్రతిచర్యకు తగుఫలితము ఈజన్మలోగాని ఉత్తరజన్మలలోగాని భూలోకములోనే పొందును.

ఉదాహరణకు ఒక జీవజంతువైన మేకను నీవు చంపి తినుచున్నావంటె వచ్చే జన్మలో నీవే ఆ మేక రూపములో జన్మించి బాధ అనుభవించుచున్నావు. ఉదాహరణకు చూడండి రావణాసురుడు లంకా పట్టణమును ఏలుచూ అనేక భక్తి ధర్మ మార్గములను అనుసరించుచుండినను ఒక తుచ్ఛ కార్యము ఆచరించినందువల్ల తన సర్వస్వము దగ్ధమైపోయినది. అహల్య అతి భక్తురాలు దైవప్రార్థన చేసుకొనుచూ జీవితమంతయూ భక్తిమార్గమున గడపినదంటే ప్రత్యక్షముగా దైవమే మానవరూపములో ప్రత్యక్షమై ఆమె తపోశక్తికి ఆనందించి ముక్తిని కలుగజేసినాడు. ఇటులనే అనేక ఉదాహరణలు చెప్పవచ్చును. దశరథుడు ముగ్గురు భార్యలతో యున్నాడంటె కామము, క్రోధము, తమస్సు యను మూడు లక్షణములు ఆయనలో యున్నవని అందువల్ల మరణించినప్పుడు శక్తిహీనుడైనాడని భావించవలసియున్నది. ఈనాడు ఇంకా చెప్పబోవు విషయం ఏమి

టంటె ఇన్నివిధములుల చిత్రించి బోధించినను ప్రజలు తప్పులు చేస్తూనేయున్నారు. వీటి నివారణ విధానము శిక్ష యీ లోకములోనే పొందుచున్నారని భావించండి. అదియును గాక దైవము ఎన్నికోట్ల జీవరాసులను ఏకైక ప్రత్యాధిగా సృష్టించగలడు శిక్షించగలడు, గనుక ఇది దైవశక్తిగాదు సృష్టి స్వభావమని వాదించువారు కూడా యున్నారు. మరి కొందరు దైవమే లేడంటారు ఇదంతా మాయ అంటారు. ఎవరు ఏవిధముగా చెప్పినను సృష్టి అనాదినుండి జరుగు చున్నది. ఈ రహస్యము చాలా దీర్ఘమైనదని భావించండి.

(12-4-75)

## పదియవ అధ్యాయము

చదువులు ఎన్ని చదివినా, వేదములు తిరుగ వేసినా దొరకని విషయం ఈ ఆత్మ అనే విషయం. బడిలో పంతులు లెక్కలు చెప్పినాడంటే వడ్డీలుకట్టి ధనమార్జించి బ్రతుక మని, కవిత్వం చెప్పినాడంటె ఆనందం పొందమని, తర్క వ్యాకరణములు చెప్పినాడంటే చెప్పినది కాదని, నాకు తెలిసినదే వాస్తవమని వాదించి ఖ్యాతిని బడయుటకు, న్యాయశాస్త్రమును చదివినాడంటె అన్యాయము, న్యాయ మని వాదించి వాది ప్రతివాదులమధ్య తగాయిదాలు పెంచి పొట్టపోసుకోమని, జ్యోతిష్యశాస్త్రము చదివినాడంటె ముందు రాబోవు మంచిచెడ్డలు తెలిసి పొట్టపోసుకోమని, నక్షత్రశాస్త్రము చెప్పినాడంటే గణితశాస్త్రములో ఒక భాగమైన ఈ విద్యవల్ల దేశకాల పరిస్థితులు తెలుపుచూ

పొట్ట పోసుకోమని, ఇకను అర్థశాస్త్రము చెప్పినాడంటే ధనమును కూడబెట్టుటకు నేను ధనవంతుడనని విర్రవీగుటకు, భూగోళశాస్త్రములు చెప్పుచున్నారంటే భూమిలోని ఖనిజములు, లోహములు బంగారము, ఇత్యాదివి బడయుటకు, పశుశాస్త్రమును చెప్పుచున్నారంటే పశోపకారము చేయుచూ ఆకలిబాధలు తీర్చుకోమని, శస్త్ర విద్యా విధానము వైద్యవిధానముకూడా దేశీయ విద్యలే, వాటివల్ల పశుల శరీర వ్యాధులు నివారణచేసి ఆర్జించి జీవయాత్ర చేసుకొనుటకు యీలాగున సమస్తవిద్యలు భూలోక జీవయాత్రకు సంబంధించినవే, కర్మసిద్ధాంతములను చెప్పుచున్నారంటే పుణ్య కర్మలయిన, నాకు దానం యివ్వమంటున్నాడు. అంటే తన సంసారయాత్రకుగాను, వేదశాస్త్రములను చదువుచున్నాడంటే అనాదికాలమునాటి ఆచరణా ధర్మములను నడుపుచున్నాడు. మంత్రశాస్త్రములవల్ల భూతప్రేత పిశాచ నివారణా మార్గములను దెల్పుచున్నారు. ఇవి అన్నియూగాక. ఈ జీవి ఎక్కడనుంచి వచ్చినది ఎటుల మరల పోవుచున్నది ఇత్యాది విషయములు గృహస్థునకు చెప్పుట లేదు. కారణం ప్రపంచ పరివర్తనకు గృహస్థునకు ఉపయోగపడదు. అందువల్ల దీనిని బాంధవ్యప్రేమలు నశించినవారు అరణ్యములలో నివసించి, కొండగుహలలో నివసించి, గరికసటి తిని ఆకలికోర్చి యోగులవద్ద తెలుసుకొనబడుచున్నది. దీనియందు అభిలాష తక్కువ. అట్టి యోగులు కాని, వారి అనుచరులుగాని, తెలుసుకుని యీశరీరము జీవితానంతరము ఏమగుచున్నది యనెడి

మర్మమును తెలుసుకొనుచున్నారు. అట్టివారు కోటికొకరు యుండవచ్చును. అట్టి కోవకు చెందినవారి చర్చనీయాంశమే ఈ ఆత్మ అంటే ఏమిటి అనే ప్రశ్న. ఇట్టి అవకాశమును దేశప్రజలు వినియోగించుకొనరు. కాని మీవంటివారు తెలుసుకోవలెనని కుతూహలము గలవారై యీ పరలోక వాసుల పరంగా తెలుసుకొనుచున్నారు. చాలా ఆనందం. జాతి మత కులభేదములన్నీ ప్రాపంచికములోనివే గాని జీవులకుగాని పరలోకములోగాని పాటింపబడవు. ఇది నేటి విషయం. (13-4-75.)

## పదనొకొండవ అధ్యాయము

జీవి పరలోకములో ఎంతకాలము యుండును. తిరిగి ఏరూపములో భూలోకమునకు చేరును అను విషయమును గురించి చర్చిద్దాము. జీవి పరలోకము చేరిన కొద్దిరోజుల వరకు విశ్రాంతి తీసుకొనును. అనంతరము దైవసన్నిధికి తీసుకుపోబడును. అక్కడ యీ జీవి భూలోకములో గత జన్మలో ఆచరించిన ప్రవర్తనయావత్తూ యీ జీవి ముఖతహా పరలోక ప్రభువులకు తెలియపరచబడును. అట్లు చెప్పుటలో భూలోకములో కోర్టు ఎదుట అబద్ధపుమాటలు చెప్పినట్లు గాని, కల్పించిగాని మరుగుపరచిగాని చెప్పకుండా జనన మందిననాటినుండి మరణమొందిన నాటివరకు జరిగిన ప్రతి చిన్నవిషయము సినిమారీలులో ఏరూపముగా ప్రదర్శింపబడునో అట్లే ముఖవర్చస్సు రూపముగా నెరుకపరుప బడును. దానినే పెద్దలు గ్రామఫోనుప్లేటుపై సూదిమోప

గానే పాడినట్లుగా ప్రదర్శింప బడును. అప్పుడు అక్కడ నున్న పెద్దలు వాటి సారాంశములను తీసి దైవమునకు నివేదించెదరు. కొలది నిమిషములలో దైవములో నుంచి ఒక భావము ఈ పెద్దల మనస్సుకు తట్టును. ఆ తట్టినదే దైవ ఆజ్ఞగా భావించి అందుకు తిరిగి భూలోకములో తగుస్థానమును విచారించి ఒక తల్లిగర్భములో జీవిని ప్రవేశింప పెట్టబడును. ఆవిధానమంతయు వివరముగా వచ్చే అధ్యాయములో చెప్పబడును. (14-4-75)

## పదిహేడవ అధ్యాయము

భూలోకములో అనేక వేల జీవరాసులు వేరువేరు రూపములో యుండినను పరలోకమునకు వెళ్లునది జీవి మాత్రమే యగుటచే జీవులన్నియు ఒకేరూపములో యుండునని గుర్తించవలెను. ఇలా వెళ్లిన జీవులు జీవితకాలములో తమరు ధరించిన శరీరము చేసిన సమస్త చర్యలు గుర్తునందు ఉంచుకొని పరలోకములో దైవము ఎదుట సాక్ష్యమిచ్చుచున్నది. ఇట్లు చెప్పబడిన సాక్ష్యములే ఆధారముగా భావించి ఉత్తర జన్మ నిర్ణయమగును. కాని అది ఏరూపములో లభించునది నిర్ణయింప బడిన పిమ్మట ఏ ప్రాంతములో మరి ఎంతకాలమునకు లభించును అను విషయములో కొన్ని అభిప్రాయ భేదములు కలుగుచున్నవి. కొందరు పండితులు వెంటనే యని లోగడ నివసించిన ప్రాంతములోనే యని చెబుతారు. కాని అది అట్లుకాదు. హిందూదేశములోని వారు జర్మనీ దేశములోనో మరి ఏ

ఇతర ప్రాంతములోనో జన్మించ వచ్చును. లేక ఏ అడవి ప్రదేశములోనో ఏ దైన జంతువు రూపము లోనో జలము లోనో జన్మించ వచ్చును. అంతయూ అచ్చటి వారి నిర్ణయమునుబట్టి యుండును. సాధారణముగా గత జన్మస్థానమునకు కొలది దూరములో కూడా లభించ వచ్చును. అట్లు జన్మించిన జీవికి గతజన్మ విషయములు కాని పరలోక విషయములు కాని గుర్తుండవు మరిన్ని ఆయువు నిర్ణయముకూడా పరలోకములోనే నిర్ణయింప బడును. కాని అగ్ని ఇత్యాది ప్రమాదముల వల్లగాని, కలరా ఇత్యాది వ్యాధుల వల్ల కాని మరి ఏ ఇతర ప్రమాద ముల వల్లగాని తటస్థించినవారు చనిపోయినను ఈ లోక ములోనే తిరుగుచూ నిర్ణయ కాలము వరకు భూలోకము లోనే గాలిలో సంచరించుచూ నిర్ణయ కాలము ప్రాప్తించిన నాడు పరలోకమునకు ప్రయాణమై వెళ్ళును అంతేగాని ఇతర జీవులమాదిరి చనిపోయిన వెంటనే ప్రయాణము చేయవు. అట్లు ప్రయాణకాలమునకు వేచియున్న జీవులే దెయ్యములు భూతములని భావింప బడుచున్నవి. ఆ దయ్య ములు భూతములు వారికి పగగలవారిపై ఆవేశించి వారిని బాధించుచుండును. ఇట్టి దోషముల నివారణకే భూతవైద్య మని జరుపుచున్నారు. మన దేశములో ఆడ, మగ యని భేదము లేకుండా సంచరించును. పరలోకము లోకి వెళ్ళి నప్పుడు సర్వజీవులు ఒకే రూపములో యుండును, ఆడమగ అనే భేదములు యుండవు. ఇది నేటి సందేశము.

(15-4-75)



వ్రాయుచున్నది నిర్మలానందస్వామి
సౌజన్యము : శ్రీ ఋషి రాంరాంవారు

## పదమూడవ అధ్యాయము

జీవుడు పరలోకము చేరినవెంటనే విచారింపబడక ఎందువల్ల విశ్రాంతి పొందింపబడుచున్నది అనగా పరలోకములో విచారణ చేయుటకు ప్రపంచములోని అన్నిప్రాంతములనుంచి వేలాది జీవులు ప్రతిరోజూ వస్తూయుంటే విచారణాదైవము ఒకరివెంటనే జరుపబడును గనుక వారివారి విచారణకాలము వచ్చుటకు వ్యవధి పట్టుచున్నది. అంతేగాని పోలీసుశాఖవారు ముద్దాయిని ఖయిదులోపెట్టి నేరమును భోగట్టా చేసినట్లుగా ఇక్కడ అవసరంలేదు.

ఇదియునుగాక ప్రతిజీవి దూరప్రయాణము చేసినందువల్ల కూడా విశ్రాంతి అవసరముగదా! ఒక జీవి చనిపోయిన పిమ్మట 10 లేక 11 మాసములకు పరలోకం చేరవచ్చును. అట్లు చేరిన పిమ్మట ఆజీవి అచ్చటనున్న ఇతరుల పరిచయంకూడా పొందుట చాలా అవసరం. ఎందువల్లనంటే వేరువేరు దేశములలో వేరువేరు మత ఆచార ధర్మములు యుండును. వీటినన్నిటినీ వారిలో వారు నెరుగ పరచుకొనెదరు! అప్పుడు భూలోకములోని వేరువేరు భాషలుకూడా వారికి అలవడుచుండును. ఇట్లు అలవడినందువల్లనే చనిపోయిన జీవి తమ జీవితకాలములోని భాషలోనేగాక ఇతరభాషలలో కూడా ఈ ఆటో రైటింగు విధానములో సందేశము నిచ్చుచున్నది. ఈ సందేశములు ఈనాటివేగాక వారి బాల్యమునుండి జరిగిన విషయములు, పరిచయములలో గాని వేరు వారితోగాని

ప్రసంగించు చున్నది. పదకొండు మాసముల పిమ్మట ఈ జీవికి సాధారణముగా విచారణ కావచ్చును. విచారణ పావుగంట మాత్రమే. అటుపిమ్మట ఆ జీవిని వేరు ఒక ప్రదేశములోనికి పంపబడును. ఆప్రదేశములో పై విధముగా విచారణ కాబడినవా రందరు యుందురు, అచ్చటకూడా ఈ జీవులకు ఆకలి దప్పికలు యుండవు. వారి తీర్పుననుస రించి ఏ ప్రదేశములో ఏరూపములో ఏగర్భములో జనన మెత్తవలసినది ఇత్యాది విషయములు అచ్చటివారు పరికించుచుందురు. వారికి అనుజ్ఞ సందేశము లభించినట్లు తెలియగానే వారు మరిఒక ప్రాంతమునకు పంపబడుదురు.

అచ్చటివారు ఈ నిర్ణయస్థానము ఎప్పుడు ఏరూప ములో పంపవలసినది నిర్ణయించిన కాలమున పరలోకము నుంచి దిగువకు పంపబడుదురు, ఆపంపబడిన జీవి వర్షము ద్వారానో, మంచులోనో మరి గాలిలోనో మిళితమై భూలో కమునకు నిర్ణయస్థలమునకువచ్చి అక్కడ పంటవస్తువులకు పోషణ వస్తువుగా తోడ్పడుచూ, ఆపంటవస్తువులు అనగా ఆహారధాన్యములు, పండ్లు, దుంపలు, కాయలరూపములో జేరి దైవికముగా వాటిని భుజింపబడిన వారి శరీరములో అవసరమై ఏర్పడుచున్న మాంసపు ముద్దలో ప్రవేశించును. ప్రవేశించిన నాటినుండి ఆమాంసపుముద్ద తల్లిరూపమును దాల్చుట ప్రారంభించును. అట్లు ప్రారంభింపబడుటయే గాక పరలోకములో నిర్ణయింపబడినట్లు దోషములతో జనన మొందవలసిన వారికి ఆయా అంగములు లభించవు అంటే గుడ్డి, కాళ్లు చేతులు వంకరలుగాని మొడసరము బలహీనత

గాని సంభవించును, మూాగ చెముడు మూాలాధారమైన దోషములుకూడా తటస్థించుచుండును. ఇట్టి దోషములు పరలోకములో నిర్ణయింపబడిన జీవులు సర్వఅవయములతోను యథావిధిగా జనన మొందును. ఇది నేటిసమాచారము.

(17-4-75)

## పదునాల్గవ అధ్యాయము

అక్షోహిణులు అక్షోహిణులుగా యుద్ధములలో మనుష్యులు బలియగుచున్నారు. వీరందరు ఏమితప్పు చేసిరి? రాజభటులగుటయే. రాజు దేశరక్షణకొరకు వేలాది ప్రజలను బలియిచ్చి అధికారమునుబడసి తన మనోవాంఛితములను తీర్చుకొనుచున్నాడు. ఇట్లు బలికాబడినవారు నిర్దోషులు. వారికిగల ప్రభుభక్తియే వారిజీవితములను బలికొనుచున్నది. ఇందలిదోషము ఎవరిది? పరిపాలించుచున్న రాజు లేక అధికారిదా లేక వీరిని ఈ కఠినచర్యకు పర ప్రభుత్వములు లేక ప్రజల అవిసీతి ప్రవర్తనయా అని విచారించినయెడల సర్వము ప్రభుత్వముదే యగును. పర ప్రభుత్వములపై దండెత్తి వారి భూభాగమును ఆక్రమించవలెననిగాని వారిపైకూడా తమ యధికారమును చలాయించవలె ననెడి అభిలాష కాని ముఖ్య కారణం. అట్లు గాక పర ప్రభుత్వములు తమపై దండెత్తి వచ్చినప్పుడు తమ ప్రజా, రాజ్యరక్షణకై జరుపు చర్యయా లేక తమ ప్రభుత్వము ప్రదేశములోని ప్రజా తిరుగుబాట్లను అణచుటకా యను మూాడు కారణములు కాగలవు. నీవు నీ ప్రజలను నీ బిడ్డలవలె రక్షించు

చున్నప్పుడు పరరాజులు నీపై దండెత్తి వచ్చుటకు సాహ సించరు. అటు కానప్పుడు నీ ప్రజలలోని వారు కొందరు పరరాజులతో కుట్రలు పన్ని నీపై దండెత్తి వచ్చుచున్నారు అంతేకాని వేరుకాదు. 2. పరదేశములపై ఆక్రమించవలె ననెడి కాంక్ష నీకు కలిగినప్పుడు. 3. ప్రజల తిరుగుబాటు. ప్రజల కష్టసుఖములను విచారించి వారి క్షేమమే నీ క్షేమ ముగా వారు నీ కుటుంబ సభ్యులుగా భావించి పరిపాలించి నప్పుడు వారు దండెత్త నవసరము లేదు. ఈ మూడింటికి ముఖ్య కారకులు పరిపాలక బృందము గనుక ఇందలి దోషము అనుభవించ వలసినది ఆ బృందము వారే కాగలరు. అందు వల్లనే యుద్ధములో చనిపోయిన వారికి పుణ్యలోకములో రంభా సంభోగము లభించునని కొందరు వచించు చున్నారు. ఇందలి యదార్థమేమనగా పరలోక ములో వీరిని విచారించినప్పుడు వీరికి ఏ దోషము అంటని వారిగా భావింపబడుదురు. ఇతర దోషములకు మాత్రమే శిక్షలు నొసంగ బడును. ఇది నా నేటి సందేశము.

(18-4-75)

## పదిహేనవ అధ్యాయము

పూర్వము మహాభారతయుద్ధములో యోధులు చని పోయినారంటే ప్రభుత్వములు, రాజులు దీర్ఘముగా ఆలో చించి యుద్ధమువల్ల దేశమునకు కలుగు హాని, చెడుగులను పర్యాలోకించి, పిమ్మట యుద్ధరంగములోనికి దిగినట్లు మరిన్ని ప్రభువులుకూడా యుద్ధరంగములో సైనికులతో

పాటు యుద్ధముచేసి హతులైనారు. కాలము మారినది. యుద్ధము చేయువారు. చేయించువారు, యుద్ధమును పురికొల్పువారు వేరు. అందువల్ల మరుగున దాగియున్నవారే యుద్ధరంగమును నడుపుచున్నారు. అంటే తమ ప్రాణములను అతి జాగ్రత్తగా కాపాడుకొనుచూ, ధన రాజ్య మదాంధులై దేశరక్షణకని చెప్పుచూ వేలాది సైనికులను పురికొల్పి వారి ప్రాణములను బలికొని పాచికలు ఆడువారు వెనుక ముందులు లేక ధనమును ఒడ్డుపెట్టినట్లు తన సైనిక బలములు వినియోగ పరచుచున్నారు. ఇందువల్ల దేశములో అనేక దురునడతలు రూపొందుటయేగాక పరలోకములో అలజడి పెరుగుచున్నది. అది ఎట్లన ఒకనాడు ఒక ప్రభుత్వమువారు పరాయి ప్రభుత్వపు వారిపై దండెత్తినారంటే గెలిచినను, ఓడిపోయినను వేటపోతులను బలిఇచ్చినట్లుగా సైనికులను బలి ఇచ్చుచున్నారు. అందువల్ల ధర్మము పెరిగిన కొలది పరలోకములోని విచారణలు, శిక్షలు పెరుగుచున్నవి. అట్లు పెరిగినందు వల్లనే ప్రజలలో గల దైవభావము నశించుచున్నది. ధనమదాంధులు పెరుగుచున్నారు. తలవని క్రొత్తక్రొత్త రకముల వ్యాధులు సంభవించుచున్నవి. ఈ వ్యాధుల నివారణకు పరిశోధనా శాలలు వైద్యబృందము వాటికి అగు వ్యయము పెరుగుచున్నది. ఆ పెరుగుటయే కారణముగా ప్రజలకు పన్నుభారములు పెరుగుచూ, జీవయాత్ర చేయుటే కష్టతరమై దేశ ప్రజలు బాధపడు చున్నారు. ఇది అంతయు గమ

నించుచున్న పరలోకములో అనేక వింతవింత తీర్పులు చెప్పబడుచున్నవి. (19-4-75)

## పదహారవ అధ్యాయము

పులులు, ఏనుగులు ఇత్యాది అడివి జంతువులు మచ్చిక చేయబడి ప్రజలమధ్య నివసించుచున్న వంటే వాటిలో యున్న స్వభావ నైజమును చెదరగొట్టి నిర్బంధములో యుంచి వాటికి అవకాశము కలుగకుండా వాటిని స్వేచ్ఛగా విహరించకుండా బంధించి నట్లుగా కుటుంబ పెద్దలు వారివారి బిడ్డలను కాపాడుచూ దుష్ప్రవర్తలకు లోనుగాకుండా నివారణ మార్గములను అవలంబించు చున్నారు. ఇదే విధముగా మానవులు అక్రమ ప్రవర్తనులు కాకుండా దైవము కాపాడుచుండినను ప్రజలు స్వేచ్ఛా పరులై అనేక దుష్ప్రవర్తనలు చేయుచున్నారు. అందుకు అవసరమైన శిక్షలు భూలోకములోనే అనుభవించు చున్నారు. ఉదాహరణకు చూడండి. ఒక బాలుడు ఒక గొర్రెను కబేళాకు తోలుకు వెళ్ళుచున్నాడంటే దాని ప్రాణమును చేతులారా హంతకులకు ఒప్పగించుచున్నా డన్నమాట. ఇది ఇట్లుండగా ఒకనాడు ఒక గొర్రెల మేపు వాడు తనగొర్రె తప్పించుకుని పారిపోయినదని యజమాని తన్ను బాధించునని ఏడ్చుచున్నాడు. కాని తాను కటిక దుకాణమునకు పంపిన వేలాది గొర్రెలు ఏమైనవని ఆలో చించుటలేదు. అంటే ఇక్కడ తాను బుద్ధి పూర్వకముగా నేరము చేయుచున్నాడు. ఇది ఇట్లుండగా మానవుడు తన

జీవితములో అనేక దుస్సంఘటనలు చేతులారా చేయు చున్నాడు. వీటన్నింటికి తను శిక్ష అనుభవించక తప్పదు. ఇదే ప్రకారము ఇహాపరలోకములలో ఏ నేరములు చేయలేదని పిలువబడు వారు గలరు. వారే దైవ సంభూతులు. వారు ఏపాప కార్యములు చేయనందున పర లోకములో ఆనందముగా వేలాది సంవత్సరములు యుండి పిమ్మట దైవమనే జ్యోతిలో అంతర్భూతమగు చున్నారు. ఇంతటితో ఈ ఆత్మ అంటే ఏమిటి అనే విషయము ముగించి రేపటినుంచి బ్రహ్మ అంటే ఏమిటి అనే విషయం చర్చి ద్దాము తెలవా.

(20-4-75)

## పదిహేడవ అధ్యాయము

చిన్నపిల్లలు బ్రహ్మ అంటే బ్రహ్మదేవుడు మనలను సృష్టించిన ఆయన అంటారు. అది అట్లాకాదు. బ్రహ్మ అనగా అనాదిపురుషుడనియు, ఈసృష్టికి మూలకారకుడని భావించవలెను. అట్టి సృష్టికి మూలకారకుడు ఎక్కడ ఉంటాడు. ఏవిధముగా ఈ సమస్త చరాచర వస్తువులను సృష్టించెను అనే విషయం విచారిద్దాము. ఈసృష్టి అనాది నాటిది. దాని మొదలు ఎవరూచెప్పలేరు. అట్టి ఈ భూ ప్రపంచములోని సమస్త పదార్థములు ఏవిధముగా సృష్టింప బడినవి అనేది మనసమస్య. ప్రతి వస్తువునకు తల్లి వస్తువు ఒకటి యున్నది. అంటే చెట్టుకు విత్తువలె. ప్రథమమున ఈవిత్తు ఎక్కడనుండి వచ్చినది. అని ఆలోచిస్తే చెట్టులోని.

పండు లేక కాయలోనుంచి వచ్చుచున్నది. ఉదాహరణకు చూడండి. ఒక పనసగింజ పాతిపెట్టితే వృక్షమగుచున్నది. అట్లు పాతిపెట్టబడ్డ గింజ నేలలోకుళ్ళి దానిలోనుంచి చిన్న చెట్టు మొలచుచున్నవి. కొంతకాలమునకు తిరిగి ఆ చెట్టుకు కాయలు వేయుచున్నవి. ఆ కాయలలో తిరిగి గింజలు ఉంటూయున్నవి. దీనినిబట్టి చెట్టు ముందా విత్తుముందా యనుసమస్య ఉత్పన్నమగుచున్నది, చెట్టుముందు అనువారు కొందరు, విత్తు ముందు అనువారు కొందరు. ఈ ప్రశ్న ఇలా ఉండగా మానవులను చూద్దాం. తల్లిగర్భమున శిశువు జననమొంది క్రమేపీ ఎదిగి తను కూడా కొంత కాలమునకు గర్భవతియై బిడ్డను కనుచున్నది. ఈవిధముగానే ప్రపంచములో కనబడే ప్రతి వస్తువు దాని తల్లి గర్భమున జనించుచున్నది. పొలములో గింజలు జల్లితే కంకులువేసి ధాన్యము వస్తూవున్నది. ఇట్టి సృష్టికి మూలకారకుడు ఎవరూ అని మన ప్రశ్న. అది ఎట్లా అంటే అది స్వభావము అంటామా కాదు. ఎందువల్లనంటే ప్రతి వస్తువులోను ఈ శక్తి ఉన్నది. మనకు చేతులు, కాళ్లు, చెవులు, కళ్లు ఇచ్చినట్లుగా ప్రతి జీవ జంతువు వాటికి అవసరమైన రూపు రేఖలు జన్మతహా ప్రాప్తించుచున్నవి, ఈ ప్రాప్తింపచేయు వస్తువు పేరే బ్రహ్మదేవుడు అంటాము. ఈ బ్రహ్మదేవుడు ఎక్కడ ఏ రూపములో యుంటాడు అనేదే ముఖ్య సమస్య. ఆయన నివాసమునకు ఒక ప్రాంతమని చెప్పలేము, ప్రతిచోట ఆయన ఉండినట్లే భావించవలెను. ఇతను ఏరూపములో యుంటాడు.

మనకు కనబడతాడా అంటే ఆయనకు రూపు రేఖలు లేవు. మనకు కనబడడు. ఎందువల్ల నంటే మనకువలె ఒక శరీరము లేదు. గాలిలో సంచారము చేయు చుండును. ఆయన గాలిలో ఉన్నాడని ఎలా చెబుతావు అనగా ప్రతి జీవిత పదార్థమునకు గాలి అవసరం. ఆ గాలి పీల్చు తేనే గాని బ్రతుకలేవు. గనుక ఆగాలిలో ఉంటాడని భావించ వలసి యున్నది. ఇది ఇట్లుండగా గాలికి ముఖ్య అవసర వస్తువు వెలుతురు. వెలుతురు ఎందులో నుంచి వచ్చుచున్నది. సూర్య కాంతిలో నుంచి. ఆ సూర్య కాంతి అనగా సూర్య కిరణములలో నుంచి అని భావించ వలెను. అందువల్లనే ప్రతిరోజు సూర్యోదయ కాలము ప్రతివారు సూర్యునికి అర్ఘ్యము ఇచ్చుచున్నారు. ఆసూర్య బింబము మధ్యాహ్నమునకు అతి వేడి సాయంత్రమునకు తిరిగి చల్లదనము కలుగ చేయుచున్నది. అట్టిశక్తి సూర్యునికి కలిగినదంటే అదికూడా బ్రహ్మ స్వభావమని భావించండి. రేపు మళ్ళీ చర్చిద్దాము. (21-4-75)

## పదునెనిమిదవ అధ్యాయము

పరులు పరలోకములు అనునవి గాక పరప్రభుత్వములు ఎలాఉన్నవో అలాగే మనవారు కాక పరులు ఎలా ఉన్నారో అదే విధముగా గాలిలో మనము పీల్చుచున్నది వదలుచున్న గాలియేగాక వేరు వేరు విషయములు మిళితమై యున్నవి. వాటిలో ఈబ్రహ్మ స్వరూప వస్తువు ఒకటి. ఇది ప్రసరించని చోటులేదు. దీనికి వాసనగాని రుచిగాని లేదు. మల్లెపువ్వుకు వాసనయున్నది. చామంతి పువ్వుకు

వాసన ప్రధానముకాదు. దానిరెక్కలు రూపురేఖలు. ఇదేవిధముగా గాలిలో మిళితమైయున్న ఈబ్రహ్మ పదార్థమునకు రూపురేఖలుగాని, వాసనగాని లేదు. ఆ బ్రహ్మ పదార్థమును ఏకారణము చేతనైనా ఒక ప్రాంతములో ప్రసరింపని యెడల ఆప్రాంతములో జనసంచారము ఉండదు. దీనినే ఆంగ్లేయులు ప్రాణవాయువు అంటారు. రోగులకు ఈ ప్రాణవాయువును గొట్టములద్వారా శరీరములోకి ప్రవేశపెట్టి కొంతకాలము వరకు ఆజీవి మరణించకుండా ఆపుచున్నారు. ఈ ప్రాణవాయువు ఎందుకు కావాలి లేకుండా బ్రతుకలేమా అంటే ఒక గడియకూడా ఏ జీవి జంతువు బ్రతుకలేదు. మానవులేకాదు, క్రిమికీటకములు సర్వ జీవజంతువులు వృక్షములకు ఇది చాలా అవసరం.

దీనినే బ్రహ్మపదార్థమని వేదములలో ఉపహరింపబడినది. అంతేగాని బ్రహ్మ అనేది ఒకమనిషి కాదు. నాల్గు తలలుగల బ్రహ్మరూపమును మనము బ్రహ్మ అని గ్రంథములలో చూపబడుచున్నది. నాల్గు తలలు అంటే అన్ని దిశలయందు ఆబ్రహ్మ పదార్థము ప్రవహించు చున్నదని దాని భావన. అట్టి బ్రహ్మజ్ఞానమును బడసిన వారు బ్రహ్మ వేత్తలు అని బ్రహ్మజ్ఞానులు అని భావింపబడుదురు. ఈ బ్రహ్మజ్ఞానపరులు సదా పరబ్రహ్మస్వరూపులుగా సకల చరాచర వస్తువులను తలంచుచుందురు. అంతేగాని ఇది ఒకజాతి ఒక మతము అని చెప్పబడునది కాదు. రేపటినుంచి ఈ బ్రహ్మజ్ఞానమును బడసిన వారి నడకలను గురించి చెబుతాను. నేటికి శలవా ! (22-4-75)

## పందొమ్మిదవ అధ్యాయము

రారాజులు కొందరు శ్రీమంతులమని క్రొవ్విడి మిత మును మించి భుజించి జీర్ణమగుటకుగాను అనేక పదార్థ ములను త్రాగుచున్నారు. ఆపదార్థములన్నియు నాటికి సుఖ వంతమైనవే కాని శరీరములోని నరములను కాల్చివేయు చున్నవి. అందువల్ల వారు తలంచినవిధముగాక అన్యవిధ ముగా దోషములను కలుగచేయుచున్నవి. అట్టి దోష ములు సంప్రాప్తించినప్పుడు ప్రాణవాయువు శరీరములో ప్రవహించుటకు అశక్తి కలుగచేయు చున్నందున వైద్య శాస్త్రనిపుణులు ఈప్రాణవాయువును గొట్టముల ద్వారా అవయవములు కందిచ్చుచున్నారు. అందువల్ల ప్రాణికి తాత్కాలిక శక్తి లభించగలదు. ఈప్రాణవాయువు జల ములో కుండా మిళితమై యుండును. అందువల్లనే మనము అన్నము భుజించునప్పుడు దాహము వేసినప్పుడు జలరూప ములో ఈ ప్రాణవాయువును అందించుచున్నాము. మరిన్ని సర్వజీవరాసులు జలపానము చేయుచున్నవి. ఇట్టి ప్రాణ వాయువునే బ్రహ్మపదార్థమని వేదములలో చెప్పబడు చున్నది. మనము ప్రతిరోజు స్నానము చేయుచున్నామంటే శరీరములోనుంచి రోమముల మూలకముగానే చమట రూప ములోను వచ్చి శరీర చర్మభాగమున యుండును. దానిని ఈనీటిలో మిళితమైయున్న బ్రహ్మపదార్థము పరంగా శుద్ధి పరచుచున్నాము. ఈ బ్రహ్మపదార్థమును తెలుసుకొన్న వారు తమ ఇంటిలోని పూజాగృహములు, పూజావస్తువులు

నీళ్లతో కడిగి శుద్ధి చేయుచున్నారు. అట్టివిధానము అనాది నాటిది. అసలు విషయము మరచి అంటు అని నీళ్లు జల్లుతే శుద్ధియగునని ఒక ఆచారముగా వాడుచున్నాము. ఇట్టిశుద్ధ పదార్థము జలరూపములోనేగాక మనము పీల్చువాయువు పరంగా పీల్చుచున్నాము. అందుకనే మంచి వెలుతురు, గాలిగల ప్రాంతములలో నివసించువారు ఆరోగ్యవంతులుగా యుందురు. ఇది నేటిసమాచారము. (23-4-75)

## ఇరువదివ అధ్యాయము

సమస్త జీవరాసులు జీవమున్నంతవరకు ప్రతిక్షణము పీల్చు పదార్థమే ఈ బ్రహ్మపదార్థము. ఈ విషయమును తెలుసుకొని ప్రవర్తించు ప్రతివారు బ్రహ్మవేత్తయేగాక బ్రహ్మజ్ఞాని అని పిలువబడుటకు అర్హుడగుచున్నాడు. ఇట్టి బ్రహ్మజ్ఞాన తత్వమును తెలుసుకున్నవారు తమరే జ్ఞానవంతులమని భావించక సమస్తప్రాణికోటికి ఈజ్ఞానమును తెలియజేయవలెను. అట్లు తెలియచేసినందువల్ల వారివారి బంధుకోటికేగాక ఈ భూప్రపంచములోని సర్వజీవరాసులకు ఉపకారము చేసినవారు కాగలరు. వారివారి ప్రారబ్ధమును బట్టి మంచిగ భావించినవారు ఆరోగ్యమును కాపాడుకొనెదరు. మరి అన్యులు చేతిలోనున్న బంగారమును తెలుసుకోలేక మట్టిముద్దయని భావించి విసర్జించిన వారివలె కాగలరు. ఇంతటితో నాసందేశము సమాప్తము.

ఇట్లు

(24-4-75) బలిచక్రవర్తి

# సందేశకర్త అగస్త్యలవారు

## ఒకటవ అధ్యాయము

ఈ భూప్రపంచములోని సర్వజీవరాసులను సృష్టించి, పెంచి మరికొంతకాలమునకు అశక్తులను చేసి నశింపుచేయుచున్న ఆ పరమాత్మయొక్క లీలావిశేషములలో ఒక భాగమైన ఆత్మ వస్తువును గురించి మిత్రులు శ్రీ ఋషిరాంరాం గారి ప్రభావమువల్ల మీపరంగా నేటినుండి పదిరోజులు నా భావములను వెల్లడిచేయుచున్నాను.

ఈ నాడు సుదినం అంటే మీ పరిచయభాగ్యం ప్రాప్తించి మీపరంగా నా అభిప్రాయములను భూలోకములోని సర్వజనులకు వెల్లడిచేయుచున్నాను. మరి కథారంగములోనికి దిగుదాము.

ఆత్మ అనేది ఒక పదార్థమువంటిది కాదు. దానికి రూపురేఖలుగాని రంగు రంగులుగాని గుర్తించుటకు అనువుగా లేదు. దానికి బాల్య, యవ్వన, కౌమారదశలు లేవు. పగలు రాత్రి యను భేదము లేదు. సర్వజీవరాసులలోను మిళితమైయున్న పదార్థము. ఈ పదార్థము పుట్టుకతో వచ్చును. చావుతో పోవును. అంటే జీవుడు కాదు. మనిషి జననమందున ఒకటి రెండు నిమిషములకు ఆశిశువు ఏడ్చుట ప్రారంభించును, అంటే ఈ ఆత్మ పదార్థము అప్పుడు ఆ శిశువులో ప్రవేశించినట్లు భావింపబడును. అది ఎక్కడ నుండి వచ్చినది ఏ విధముగా ఆశిశువులో ప్రవేశించినది

ఎవరూ చెప్పలేరు. కాని యీ ఆత్మ ప్రవేశించగానే ఆశిశువు ఏడ్చుటే కాదు. కదలాడును. అట్టి యీ ఆత్మ గాలిలో మిళితమైయుండి శిశువుయొక్క ముక్కు రంధ్రములగుండా శరీరములో ప్రవేశించినట్లు భావింపవలెను. ఇట్లు ప్రవేశింపగానే కరెంటు పాకినట్లు శిశువు కదలాడును.

మరి ఇట్లు ప్రవేశించిన ఆత్మ జీవితకాలమంతయు శరీరములో దాగియుండును. అది శరీరములో యున్నంత కాలము ఈ శరీరమునకు కలుగజేసిన పోషక పదార్థముల సహాయముతో ఈ శరీరమును పెంచును. కాని కొంత కాలమునకు పిమ్మట అనగా వృద్ధాప్యము కలిగినదంటే పెంచు స్వభావము కుంటుపడినట్లు భావించవలెను. అట్లు కుంటుబడుటయేగాక ఒకనాడు ఆత్మ ఈశరీరములో నుంచి వెడలిపోవును. ఏవిధముగా వెడలినదంటే శరీరములోని నవరంధ్రముల పరంగా వచ్చినట్లే తిరిగి వెళ్ళి గాలిలో మిళితమగుచున్నది. అట్లు ఆ ఆత్మ శరీరమును బాయగానే జీవికూడా శరీరమునుండి వెడలును. అప్పుడు ఆజీవి మరణించినట్లు భావించి మనకుల ఆచారధర్మముల ప్రకారం ఆ శరీరమును రూపరహితము చేయుచున్నాము. ఇట్లు వెడలిన ఆత్మ మరి ఎక్కడకు వెళ్ళిన విషయం రేపటినుంచి విపులముగా చర్చిద్దాము. ఈ నాటికి శలవా! (25-4-75)

## రెండవ అధ్యాయము

చిన్నచిన్న సమస్యలు నివారణచేయుట సులభమే కాని ఈ ఆత్మను గురించిన విషయము అటువంటిది కాదు.

అనాదినుంచి ఎంతోమంది వారివారి అభిప్రాయములను ప్రకటించి నారు. కాని ఏ ఒకరి సమాధానము ఇతరుల సమాధానముతో కలియదు. అంతే గాక ప్రతివారు చెప్పు దానిలో కొన్ని విషయములు యథార్థముగా గాన్పించు చున్నవి. ఇట్టి ఈ ఆత్మపదార్థమును గురించి నేను చెప్ప బోవు విషయము మీమనకు తృప్తి నివ్వకపోవచ్చును. నన్ను ఒక అసమర్థునిగా మీరు భావించవచ్చును. లేక నేను చెప్పు విధానమే ధర్మసమ్మతమైనదిగా మీకు తోచ వచ్చును. గనుక విషయమునుగురించి విమర్శించక మీకు అనుకూలముగా యున్నంతవరకు ధర్మముగా భావించండి లేనియెడల మరీసంతోషమే.

ఆత్మ అనే పదార్థమునకు రూపరేఖలు లేవు. జన్మ స్థానము లేదు. ప్రతిచోటయున్నది. ఇది గాలిలోకలసి యుం డును. గాలి వీచినప్పుడు మనము ఆనందించుచున్నాము. గాలి లేనప్పుడు ఉక్కపెట్టినదని బాధపడుచున్నాము, ఇది కొందరు ఆత్మ అంటారు మరి కొందరు కాదంటారు. నా అభిప్రాయములో ఇది ఆత్మకాదు. ఆత్మపదార్థము మన శరీరములో గర్భవాసమున దాగియున్నది. అది చిన్నజ్యోతి వంటిది. ఆజ్యోతి ఏమాత్రము గాలివేసినను ఆరిపోగలదు. కాని దానికి నలుప్రక్కల నరములుయుండి మధ్య ఆజ్యోతి రూపమైన ఆత్మ యుండుటచే ఆరుటకు అవకాశము లేదు, దీపములో చమురు యున్నంతసేపే వెలుగుచుండును. అలు లనే మీరు భుజించు పదార్థములోని సారము నెత్తురురూప ములో శరీర నరములగుండా ప్రవహించుచున్నంత కాలమే

ఈ జ్యోతి వెలుగుచుండును. అట్లు వెలుగు జ్యోతి శక్తివల్ల శరీరములోని జీవి యను యంత్రము పనిచేయుచుండును. ఆ యంత్రము పనిచేసినంత కాలము రక్తము ప్రవహించుచుండును. అవయవములు శుచిగా యుండును. దానికి మీరు భుజించు ఆహార పానీయముల దోషమువల్ల గాని మరి ఏ కారణమువల్ల గాని పనిచేయునప్పుడు జీవి శరీరమును బాసి వెడలును. అప్పుడు ఆత్మజ్యోతి ఆరిపోయి ఆత్మ పదార్థము కూడా శరీరములోని రంధ్రములగుండా గాలిలో కలసి పోవును. అప్పుడు ఈ శరీరము పనిచేయలేక కుళ్లువాసన పుట్టును. అందువల్ల దానిని రూపరహితము చేయుచున్నాము.

ఈ ఆత్మ పదార్థము గాలిలో మిళితమైపోవుచున్నది. జీవి పరలోకమునకు ఆకాశమార్గమున అదృశ్యరూపములో పోవుచున్నది. అట్లుపోయి పరలోకము చేరుచు. అంతేగాక పిల్లలు బడినుండి ఇంటికివచ్చి, తమయొక్క పాఠముని గురించి తల్లిదండ్రులతో చాడీలు చెప్పినట్లుగా భూలోకమందు తను ధరించిన శరీరము చేసిన తప్పొప్పులను గురించి ఆదైవము ఎదుట చెప్పును. అట్లు విన్న ఆదైవము ఆలోచించి అట్టి తప్పొప్పులకు అవసరసలహాలను చెప్పి తిరిగ పిల్లలను తల్లిదండ్రులు మందలించి పంపునట్లుగా ఈ జీవిని భూలోకమునకు పంపుచున్నారు. ఈ పర్యాయము ఈ జీవి అట్టి దోషములను పునహాచేయకుండా యుండును. అట్లుగాక చేసిన దోషములు ఘోరమైనవి అయినయెడల గుడ్డివానిగానో, అంగహీనునిగానో లేక ఇంక నీచజంతురూపము

లోనో జన్మించుమనని నా భావన. ఇది నా నేటి సందేశము. శేషు తిరిగి కలుద్దాము. (26-4-75)

## మూడవ అధ్యాయము

చాలా రోజుల క్రితము ఒక మానవుడుగా జన్మించినవాడే దుష్ప్రవర్తనలవల్ల జంతువుగానో, పక్షిగానో జన్మించవచ్చును అంటారు. అది ఎంతవరకు నిజము, కాని యదార్థము మనము ఎలా తెలుసుకోగలము అంటే పక్షిగా జన్మించినప్పుడు పూర్వపు వాసనవల్ల ఆ పక్షి ఒక ఇంటిలోనో ప్రాంతములోనో నివసించుచూ ఆ ఇంటివారు పారవేయు ఆహారపదార్థములను భుజించుచుండును. ఉదాహరణకు పావురాలు: పావురాయిలను కొందరు పెంచుతారు. వాటిలో వినోదమును పొందుచుంటారు. ఆపావరాయితే దూర ప్రయాణము చేసి తిరిగి ఆ ప్రాంతమునకే వచ్చును. అదిన్నీ కాక జీవజంతువులలో పిల్లి, కుక్క, మేక ఇత్యాదివి ఆ ఇంటి వారిని అంటిపెట్టుకుని జీవించుచుండును. అంటే పూర్వజన్మ బాంధవ్య సువాసనయే ముఖ్య కారణము. ఒక పెద్దమనిషి పిల్లిని చంక బెట్టుకుని ఆడుకుంటాడు. కోళ్లు పెంచుచున్నారంటే వాటికి పూర్వ జన్మలో కలిగిన దోష విముక్తికొరకే ఈజన్మలో ఒకరి ఇంట జన్మించి వారిచే పెంచబడి మరి ఒకరోజున వారిచే జీవితము ముగింపు చేయబడుచున్నది. ఇది అంతయు పూర్వ జన్మ బాంధవ్యమే కాని వేరు కాదు. అహల్యా శాపవిమోచనము అంటారు. అది అహల్య కాదు. ఒక రూపవతి స్త్రీ.

ఆమెను పరులు ప్రేమించి భంగపరచ దలచినప్పుడు ఆమెకు గల జ్ఞానశక్తిచే కుటుంబస్త్రీ రూపురేఖలు మార్చి యోగి రూపముదాల్చి జీవితశేషమును గడిపినది. అంటే అది జీవితకాలములోనే కలిగిన మార్పు, అటులనే దైవికముగ ఒక వృద్ధ స్త్రీ బంధుప్రేమలతో మునిగియున్నదంటే ఆమె జీవితములో ఆబంధువులు ఆమెను పోషించి రక్షించినవారు. అదేవిధముగ యజమాని సేవకుడు కూడా పూర్వజన్మలోని సంబంధమే యని భావించవలసి యుంటుంది. ఈ బాంధవ్య ప్రేమలకు ముఖ్యకారణము వారి వారి శరీరములో సంచరించిన జీవియొక్క అభిలాషలే యని భావించండి. ఇదియును గాక ఇంకా చిన్న విషయం చెబుతాను. మీ ఇంటిలో అనేక ఎలుకలు ఇత్యాది జీవజంతువులు నివసించుచూ మీ మీ పదార్థములను అపహరించి భుజించుచున్నవి. అంటే మీరు పూర్వ జన్మలో ఆయాజీవులకు బాకీ పడినందున అవి వేరు వేరు విధములలో ప్రవేశించి మీ ఆస్తిని అపహరించి తిని ఋణ విముక్తిని చేయుచున్నవి. మీ ధాన్యపు రాసిలో ఎలుకలు కన్నముపెట్టి తినుచున్నవి అంటే మీరు చేతులారా దానము పూర్వకముగా పాతబాకీలు తీర్చనప్పుడు పై విధములుగా తీర్చుకొనుచున్నవి. అంతేగాని అవి ధాన్యమును అపహరించుచున్నవని భావించుట పొరపాటు. ఒకరిపొలములో కాపలాయున్న వ్యక్తి రాశిలోని గింజలు అపహరించినాడంటే పూర్వజన్మ ఋణవిముక్తికిగాను ఆకాపలాయున్న మనిషికి అపహరించవలెననెడి భావన కలుగుచున్నది. కాని

వాడు దొంగ నా ఆస్తి అపహరించినాడని వానిని ఆనాటి నుండి నీ ఉద్యోగమునుంచి తొలగించుచున్నావంటే నీఋణ విముక్తి అయిపోయినది వెళ్ళమన్నావన్నమాట. నీకు సంతానము లేక ఇంకొకరి కుర్రవానిని పెంచుకొనినావంటే వాని బాకీ ఈ విధముగా తీర్చుకొను చున్నావన్నమాట. కన్యాదానంచేసి కట్నంఇస్తూ యున్నావంటే ఆబాలికరూపములో నీఆస్థినుంచి కొంతధనం సంపత్తితో పరాయివాని ఋణం తీర్చుకొను చున్నవన్నమాట. ఇదేవిధముగా జన్మపరంపరలు ప్రాప్తించుచున్నవని గ్రహించండి. నేటికి శెలవు.

(27-4-75)

## నాలుగవ అధ్యాయము

ఈరోజున ఉదయం శ్రీ ఋషిరాంరాంగారు కలసి మాట్లాడుచూ నిన్నటిదినం మీరు చెప్పిన సందేశములో ఒక విషయం చెప్పమరచినారు. అదిఏమనగా ఒక ఏనుగును పెంచు మావటివాడు దానిని శూలముతో గుచ్చుచున్నాడు గదా అది ఎందుకు ఊరుకున్నది నొప్పిలేదా? అంటే నొప్పి ఉన్నమాట వాస్తవమే, పూర్వజన్మలో ఆ ఏనుగు, ఏనుగుకాదు. అది ఆనాడు ఒక క్రౌర్యముతో పరులను హింసించిన రాక్షసి. ఆదోషమువల్ల ఈనాడు మావటి వానిచే శూలముతో బాధలు పొందుచున్నది. ఇదేవిధముగా అగ్నిలో దహింప బడుచున్న కట్టెలు పూర్వ జన్మలోని పరోపకార బుద్ధిలేని క్రూర రాక్షసులు. ఆ హింసించి వారి నెత్తురుకండలు అనుభవించి శల్యములను కుప్పలు

కుప్పలుగా పారవేసినప్పుడు వాటిని కూలీలు తీసుకువెళ్లి ఆ బొమికల లోని సారమేమైనా ఉన్నదేమోయని పరీక్షించి రుచిచూచి పిమ్మట ఆ బొమికలను దూర దూరముగా పారవేయుచున్నవి.

అట్లు పారవేయబడిన బొమికలే ఒకనాడు వృక్షములై అడవిలో పెరిగి ఎండి కట్టెలుగా కొట్టబడి కట్టెలమ్మువారిచే అమ్మబడి మనము వంట చెరుకుగా వాడుకొనుచున్నాము. దీనికిన్ని దానికిన్ని భేదమేమి యని విచారిస్తే ఆ రాక్షస ప్రవర్తకులే నేడు అడవిలో వృక్షములై జన్మించినవని భావించవలసి యున్నది. ఇదే విధముగా ఈ భూ ప్రపంచము లోనే శిక్షలు పొందుచున్నారని ఉదాహరణకు పై రెండు ఉదాహరణలు చెప్పబడినవి.

భార్యను భర్త కొట్టి నాడంటే ఇది కూడా అటువంటిదే. ఒక కాలమున పూర్వ జన్మలో భర్తను భార్య స కాలమున భోజనము పెట్టక తిప్పలు పెట్టినందువల్ల ఈ జన్మలో భర్తచే దెబ్బలు తినుచున్నదని భావించండి. ఇదియునుగాక ఈ భూ ప్రపంచములో పరిపాలకులు ప్రజలను హింసించుచున్నారంటే రాజ్యములను కూలద్రోలిన ప్రజలే ఈ జన్మలో దాని ఫలితమును అనుభవించుచున్నారని భావించండి. పరరాజులు దండెత్తి వచ్చినారంటే పూర్వజన్మలో పరప్రజల ఆస్తి పాస్తులను దోచుకున్నదుండగీండ్రకు ఈజన్మలో లభించు శిక్షయని భావించండి. అంతే గాని వేరు కాదు,

నేటి సాయంకాలము మంచి వెన్నెలలో విందులు చేసుకొను చున్నారంటే మధ్యాహ్నం ఎండరస్మికి తాళ లేక రాత్రిపూట చేసుకొను చున్నారు. అంతియేగాక అపరాహ్న వేళ భోజనము చేసిన భోజనము జీర్ణమై రక్తము ప్రవహించును. రాత్రిపూట నక్కలు శవములను పీక్కు తినును. అదేవిధముగా రాత్రులందు భుజించువారు ఘోంసు ఆనందము. గాయత్రీ మంత్రమును జపించవలసిన బ్రాహ్మణులు నేడు కాఫీ గ్లాసు చేయుచున్నారు. సూర్యోదయ కాలమందు, ఇది రాక్షస స్వభావము కారణము. సూర్యోదయ కాలమందు కాకులు వెంటాడును. అదే విధముగా ఈభూలోక వాసులను పొందుచున్నారు. ఇందు నేను కఠినముగా విమర్శించినానని భావించవద్దు. ఇది యంతయు పూర్వజన్మ దోషఫలితమే. గాని వేరుకాదని నమ్మండి. ఈ ఉదాహరణలు ఎందుకు చెప్పినానంటే పరలోకములో శిక్షలు చెప్పవారేగాని శిక్షలు అమలు పరచువారు ఈ భూలోకములో యున్నారని తెలియ జెప్పినాను. (28-4-75)

## ఐదవ అధ్యాయము

జీవి అనగా ఒకవస్తువుకాదు. నేలమీద పడవేస్తే పగలదు. నీళ్ళలో పడవేస్తే తడవదు. అగ్నిలో దగ్ధము కాదు రూపము లేదు. కంటికి కనబడదు. చేతితో తాకితే అంటదు. అటువంటి పదార్థము. దానికి రూపురేఖలు లేవు. మరిన్ని దాని పొడవు, వెడల్పులు, లావు అనునవి తెలి

యదు. అట్టి ఈ పదార్థము చీమవద్దనుంచి ఏనుగు వరకు ప్రతిజీవిలోను, మానవులలోను, చెట్లు ఇత్యాది వస్తువుల యందు అనగా పుట్టినప్పటి కంటె దిన దిన ప్రవర్ధమాన మౌగా పెరిగి కొంత కాలము పిమ్మట నశించే ప్రతి పదార్థము లోను యున్నదని నమ్మండి.

ఇది ప్రవేశించినది కాని వెడలునది కాని ఎవరి కంటికీ కనబడదు. కాని దీనిలో జీవి ఉన్నది. దీనిలోని జీవి వెళ్లిపోయినదని చెప్పుటకు కొన్ని ప్రత్యక్ష దృష్టాంతరములు యున్నవి. జీవి శరీరములో యున్నంతవరకే అవయవములు పనిచేయును. అంటే కాలు, చెయ్యి, కన్ను వాటి వాటి ధర్మములను ఆచరించును. అట్లు ఆచరించుట లేదంటే జీవి లేక ప్రాణి ఆశరీరములో నుంచి బైటకు వెళ్లిపోయి నట్లు భావించుచున్నాము. మరియ్ని ఈజీవి ఈభూలోకమును వీడి గాలిలో మిళితమై పరలోకమునకు వెడలి అచ్చట దాని ధర్మములను ఆచరించిన పిమ్మట తిరిగి భూలోకము నకే వచ్చి మరి వేరుశరీరములో ప్రవేశించు చున్నదని పెద్దలు అనాదికాలమునుంచి పరిశోధనలు చేసి చెప్పుచు న్నారు. ఇది జీవియొక్క కర్మవిధానము. రూపాయినాణెము ఒకనాడు శ్రీమంతుని ఖజానా పెట్టెలో యుండును. మరి ఒక నాడు దరిద్రుని బిక్షాపాత్రలో యుండును. అదే విధముగా ఈజీవి సంచారము చేయుచుండును. ఇది నా నేటిసలహా.

( 29-4-75 )

## ఆరవ అధ్యాయము

జీవుడు శరీరములో యున్నంత సేపు మనము మహా గర్వముతో పని చేస్తాము. ఆజీవుడు శరీరమును బాయగానే పరోపకారము చేసి తనలోనున్నయము నశించి ఆశరీరమును బంధువులు దహనసంస్కారము చేయుచున్నారు. అంతేగాని ఈశరీరములోని జీవుడు ఏమైనాడు ఎక్కడికి ఎందుకు పోయినాడని విచారించము. ఆచింతన కలుగుటయే ఆధ్యాత్మిక చింతనకు ప్రథమ సోపానము. అట్లు కలిగినవారు దానిని పెద్దల సహకారమును బడసి తెలుసుకొనుచున్నారు. అప్పుడు వారికి దైవచింతన లభించుచున్నది. ఆచింతన పెరిగిన కొలది మనస్సులోనే అనేక విషయములు, సందేహములు కలిగి ఇతరుల సహాయముతో ఆ సమస్యలను చిక్కు తీసినట్లుగా తెలుసుకొనుచున్నావు. ఇది అంతయు దైవికమని దైవమను వాడు ఒకడు యున్నాడని ఈ జరుగు సమస్త చర్యలు ఆయన లీలలని తెలుసుకొనుచున్నావు. పిమ్మట ఆయనను చూడవలెనని అది ఎట్లని పరితపించుచూ దైవచింతనలోని కాలములో కొంత భాగమును వినియోగించుచున్నావు. వినియోగించిన కొలదీ నీటిలో మునిగిన చేప ఒడ్డునను చేరునట్లుగా తెలుసుకొని ఆనందించుచున్నావు, అప్పుడు ఆనందించునది ఎవరు ? ఈశరీరమా లేక మనసా ? మనసు, ఆ ఆనందసాగరములో మునిగినవానికి ప్రాపంచిక బాంధవ్యములు ఒకటొకటి దూరమగును. ఇది నేటి సమాచారము

(30-4-75)

## ౮౮౮ అధ్యాయము

భూమిలో అనేక విధములైన ఖనిజములు ఉత్పత్తి యగుచున్నవి. అవి ఇక్కడ పూర్వము ఎవరైనను దాచినవి గాని కాదు. భూమిలో ఉత్పత్తియగుచున్నవి. నదులలో సరస్సుల లోను, సముద్రములోను మత్స్యములు, తిమింగలములు ఇత్యాదివి ఉత్పత్తియగుచున్నవి. భూమిపై మానవులు, పక్షులు, క్రిమికీటకములు ఇత్యాదివి ఎన్నో ఉత్పత్తియగు చున్నవి. ఇది అంతయు సృష్టి క్రమము. అనాదినుండి వచ్చుచున్నది. దీనికి మొదలుగాని చివరగాని కాన్పిం చదు. ఈ విధముగా జరుగుచున్న ప్రపంచక్రమమునకు మూలకారకులు ఉండవలెను గదా వారే దైవము. వారిని మీరు ఏ పేరుతో పిలచినను కాదనరు. కాని మనమే ఆ పేరు భేదములకు తగవులాడుచున్నాము. ఇది ఇట్లుండ సర్వ జీవ జంతువులలో దాగియున్న ఆత్మజీవి, మనస్సు ఇత్యాది పదా ర్థములను సృష్టించి లయింపబడ చేయుచున్నవి. వీటి పుట్టుక లను గురించి మనలో మనము తగాయిదాలు పడుచున్నాము గాని, నిర్ణయము నకు రాలేదు. గనుక ప్రతిమానవుడు ఆత్మ జ్ఞానమును పెంపుచేసుకొనుచూ జీవయాత్ర గడపండి. ఇది నా అంత్య సందేశము. శెలవా? (1-5-75)

---